# అభినవసరస్వతి



సంపుటము ౨౯ | ఈశ్వరనామ సంవత్సరము ఆషాఢమాసము | సంచిక ౪

## కృతి విమర్శనము

సప్తశతీసారము— ఇయ్యది గోవర్ధనాచార్య సంస్కృతమున కాంధ్రీకరణము. శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారిచేఁ బ్రణీతము. గోవర్ధనాచార్యులు 700 ఆర్యావృత్తములతో వ్రాసినందున నిది యార్యాసప్తశతియని వ్యవహృతము. సూర్యనారాయణశాస్త్రిగారు 70) ల వృత్తములను దెలిఁగించియు నందుత్తమోత్తమములే యిందుఁ జేర్చి శ్రీ దైవముదిన్నె రామారెడ్డిగారికిఁ గృతియిచ్చిరి. శాస్త్రిగారి కవిత్వము మృదుమధురము. సలక్షణము. వైయాకరణులైన వీరి కవిత్వము నిర్దుష్టమైయుండుటకు సందేహములేదు. కాని సర్వజనులను సకలవిషయములను స్వాతంత్ర్యసంపాదనమునకుఁ బురికొల్పు కాలపు మహిమచే వీరును స్వతంత్రించి

కం. సిరిచెలువ కేల మూయఁగ
గురుజఘనముగాంచ నాభికుహరమునుండిన్
బఱతెంచినట్ల తగు తా
మరఁబోలు ముకుందు కన్ను మనుచుత మిమ్మున్.

మున్నగు పద్యములలో నుండినిత్యాదులు బుద్ధిపూర్వకముగనే ప్రయోగించిరి. కాని యీమాత్రపు జ్ఞానము లేక కాదు. మచ్చున కింకను నీగ్రంథమందలి కొన్ని పద్యము లుదాహ్రియమాణములు.

తే. పాన్పుపయి రాణివలెఁ బ్రభుత్వంబు నెఱపు
గురువువలెఁ గామతంత్రంబు గఱపుఁ బనులు
దాసివలెఁ దీర్చు సిరివోలెఁ దనరు నింట
గురులకడ మూర్తలజ్జనాఁ దిరుగుఁ దరుణి. 150

తే. చెలువ నిన్నఱకంటఁ జూచినదొ లేదొ
హృదయపర్యంతము హరించి తివ్విధముగ.
చెలువుఁడా! నీకుఁ జేయంగఁ జెల్లునోయి?
వ్రేలి నాకింప ముంజేతి మ్రింగఁదగున? 197

తే. ఊఁపు లూఁపంగఁ దమకంబు కాఁపుపడుచు
బాటసారిం దగుల్కొని పండియుండె
మైమఱచి మంచెక్రిందట. మరలెదేల
కీరబృందంబ ! కేళిహుంకృతుల కళికి ? 201

కం. తనబలముఁ దనప్రతాపము
అనంతముగ నిరుగుపొరుగులయ్యల యెదుటన్
తన ముసలిమగఁడు చాటఁగ
విని జవ్వని విటుని గాంచి పెడమరలి నగున్. 244

ఆ. వె. పువ్వువిల్తు కయ్యమున జవ్వని పరుండు
అలసి సొలసి యెవని యంకమందు
అలరువింటివాని యల్లెత్రాడువిధమున
వాఁడె ఘనుఁడు. వాఁడె భాగ్యశాలి. 281

నిర్వచనభారతగర్భరామాయణము— జయపురమహారాజుగారగు శ్రీ విక్రమదేవవర్మగారిచే 6-5-33 న నీయఁబడిన కవితాకోవిదయను బిరుదుగల రావిపాటి లక్ష్మీనారాయణగా రేతద్గ్రంథకర్తలు. వెల 0-8-0. దీనిని శతావధాని చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రులుగారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు వడ్డాది సుబ్బారాయుఁడుగారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు మున్నగు మహాకవులుగూడ మెచ్చుకొనుచు సదభిప్రాయము లిచ్చియుండిరి. వివిధకంద నిరోష్ఠ్య ముక్తపదగ్రస్త పుష్పమాలికాదిబంధాచ్ఛాంధ్రపద్యములలోఁ గూడ భారతగర్భపద్యముల వదలకుండ వ్రాయఁబడిన రామాయణ మీయన భాషాపాటవమును వెల్లడించుచున్నది. వివాహవేదికయందు సీత రాముని కంఠమునఁ బుష్పమాలిక వేయుట పుష్పమాలికాబంధమందే వ్రాసి యీకవి చమత్కరించెను. కొన్నిపద్యములు గర్భకవిత్వమైనను గడు మనోహరములుగా నున్నయవి. ఇందనేక చిత్రములు గలవు. ఈకవిది గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోని రావిపాడు. బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఆఱువేలనియోగి.

శా. ఆవీరుండు సభన్ ధృతిస్ఫురణు దైత్యాళిప్రభుం గాంచె, నా
పై వాయింగని చెప్పె సెట్టిపనికై వచ్చెన్, దనుం దెల్పె, నా
హా విఖ్యాతుఁడవంచు నుర్విజను నీ వర్ణింపవే యంచునన్
దా వేవేగను మాఱుపల్కె ఖరివో తాల్మిన్ గడున్ వీడుచున్

అను రామాయణార్థపద్యమును నేతద్గర్భస్థమై భారతార్థముగల

క. ఆవీరుండు సభన్ ధృతి వాదింపని చెప్పె నెట్టిపన్నిక వచ్చెన్
హా! విఖ్యాతుఁడవంచును వేనేగను మీఱిపల్కె విరివాతాల్మిన్.

అను పద్యమును జూచిన దీని శైలి కొంత తెలియఁగలదు.

జయంతి — ఇది మహామహోపాధ్యాయాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలుగారికిని గింకవీంద్రఘటాపంచాననేత్యాదిబిరుదాంకితులగు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిలుగారికిని జరుగు విద్యావిషయక వాదప్రతివాదముల పరిణామము. కృష్ణమూర్తిశాస్త్రిలుగారు బహుగ్రంథకర్తలగుటయే కాక భారత మంతయుం దెలిఁగించిన పండితకవులు. వెంకటశాస్త్రిలుగారు వివిధగ్రంథములు రచియించిన విశ్వవిఖ్యాతవిద్వత్కవులు. అఖిలాంధ్రగ్రంథకర్తృవంద్యనీయులగు నయ్యిరువురు గురుశిష్యసంబంధముగల చిరస్నేహితు లయ్యుఁ బ్రకృతము బద్ధవిరోధులై పత్రికాముఖంబునఁ బరస్పరకవిత్వములు పరామర్శించుకొనుచున్నవారు. ఉభయవాదములను విమర్శించి న్యాయ్యమైన తీర్పు చెప్పుఁడని వెంకటశాస్త్రిలుగారు జయంతి రామయ్యపంతులుగారిని సంబోధించి వ్రాసిన పద్యములే యీ జయంతి. రామయ్యపంతులుగారు ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు అసిస్టాంటుకలెక్టరుపదవులను వహించి నిష్పక్షపాతముగా నిఖిలవ్యవహారములను నిర్వర్తించిన నీతికోవిదులు నాంగ్లమందే కాక యాంధ్రసంస్కృతములయందును నసాధారణప్రజ్ఞగలవారు నగుటచేఁ బక్షపాతరహితముగం బరిశీలించి చేసిన న్యాయ్యమైన తీర్మానమే యీ జయంతినామక గ్రంథమునకుఁ బీఠిక. ఇందు వెంకటశాస్త్రిలుగారి బొబ్బిలిపట్టాభిషేకమునఁ గృష్ణమూర్తిశాస్త్రిలుగారు తీసిన తప్పులను వెంకటశాస్త్రిలుగారు చెప్పినసమాధానములను నుదాహరించి యేదో యొకటి తప్పుఁ దక్కినవి తప్పులుగావనియే శ్రీరామయ్యపంతులుగారు తీర్మానించిరి. ఇఁకను గల విశేషము లెల్లరకును హృద్యములగు వెంకటశాస్త్రిలుగారి దిగువపద్యంబులఁ దిలకించినఁ దెలియనయ్యెడిని.

శా. నాకన్నన్ గురుకన్ననున్ వయసులోనన్ బుద్ధిలోనం గడున్
నీకే మార్కులు వచ్చు. ఇంకఁ గవితాస్ఫూర్తిన్ నిఘంటుశ్రమ
ప్రాకట్యమ్మున నీకె వోట్లు కడున్ వచ్చెన్. నిజం బింత. నీ
వ్యాకర్తృత్వబలమ్ము చూపి గురుదుర్వాదంబు వారింపవే. 1

శా. తిట్టం దిట్టఁడు కొట్టఁ గొట్టఁడు మహోద్రేకమ్ము చూపించుచో
వెట్టం జూపఁడుగాక వెంకన. కళావిఖ్యాతితో పాటుగా
నెట్టో పుట్టిన యాత్మసత్కవిత నే రేమాత్రమున్ దూఱు నా
చెట్టన్ సైఁపఁడు పార్థుఁ డన్నపయి లేచెన్. చూచినారే కదా

మ. సరకాశ్నాకరిపీడి పెన్నున విశ్రాంతిన్ సుఖంబుండి నే
చిరకాలమ్ము గతించె నిట్టి గొడవం జిత్తంబు చొప్పింపనం

చుర కేమేనని చెప్పికొందునా ? ఇదే యుద్యోగ మీవిప్పు డా
దరముంబూని యొనర్చుచుం డెఱిఁగితిం దథ్యమ్ము కవ్యగ్రణీ !

మ. తెలుఁగుం గోశము సంస్కృతమ్మునయెడన్ దీపించుకోశంపుఁ గ
ట్టలుగానీ యల చిన్నసూరి కృతిమాటల్ గాని లేశంబు నో
జ్జలు వీక్షింపరు. తప్పులం దుఱికి. త త్సారస్య మీక్షింపఁగా
వలెఁగానీ వచియింపఁగాఁ దరమెటుల్ వాక్రుచ్చ మార్యాగ్రణీ

మ. అనలంబం దొకకాలు గందమునయం దన్యాంఘ్రిగా నీను వ
ర్తన యుద్యోగపుఁ గాలమందు నడిచెన్. తద్రీతి యి ప్పిల్లవా
రిని మెప్పించెడిఁగాక. మర్శనపుదారిం జక్కఁగాఁ జూచి వెం
కనపాండిత్యము నోజ్జపాండితియు నిష్కర్షించి వాక్రుచ్చవే. 68

శా. ఈరీతిన్ విమృశించువారు కవి గాఁ డివ్వాఁడటంచు న్ననున్
దూఱన్ నేఁ గవిఁగాకపోదునను దుర్దుఃఖమ్మునన్ నిన్ను నే
కోరన్. గొప్పపదానఁ గాలిడియు నెగ్గుల్ లేనివే చూపి లో
కారాధ్యత్వము వారు గాంచుటెటులో యార్యా ! విచారింపవే.

మ. మతిమంతుల్ సువిమర్శనంబని యెటుల్ మన్నింతు రిద్దాని ? సం
స్కృతమం దొజ్జకుఁ బ్రజ్ఞ తక్కువని మున్ శిష్టాబుధుం డాడె. సం
గతమే యయ్యది. తెల్గుపట్ల నటులే కన్పట్టుఁజు. మ్మొజ్జ యం
కితమున్ నీకు ఘటింపనెంచి యిటుగాఁ గ్రీడించెనేమో కదే. 72

శా. తిట్టుల్ సైచితి. ఒట్లు కొప్పితిని. వర్ధిష్ణుల్ గురుల్ గొట్టు చే
ప్పట్టుల్ కాకరపర్రిచప్పటులటుల్ పాటించితిన్ మెల్లఁగన్.
గుట్టుంబట్టుక తద్విమర్శనము చేకొన్నాఁడ. నా చేతి యీ
పట్టున్ భల్లూకపట్టు. విప్పుటకు విశ్వస్రష్టయే కావలెన్. 125

శా. దిద్దంగందగువాఁడనో యొరులకున్. దిద్దించుకోఁదగ్గ సం
విద్దూరుండనో ? పెద్దవాఁడవని నిన్ వేమాఱు ప్రశ్నింతు. నన్
దిద్దంగందగు పాండితీగరిమ మేదీ యచ్చోటన్ ? వారి సం
విద్దర్పంబది యీవిమర్శనమె తా విస్పష్టముం జేసెడిన్. 129

మ. శ్రితపాండిత్యము నాదికాదు. గురులన్ శుశ్రూషకావించి నే
ర్చితి నేకొంచెమొ శాస్త్రం. మీదృశు ననున్ శ్రీపాదగుర్వాగ్రహో

గ్రిత సేయంగల కార్యమేమి? ఇది కొంగా? కాదటంచుం బతి
వ్రిత ము న్నాడిన భారతం దెలుఁగరో ప్రాజ్ఞుల్ గురుశ్రీపదుల్!

మ. వినుఁడన్నన్ వినరెవ్వరున్. గురుని సంవిద్వైభవం బట్టిదే
అనువార్ కొందఱు. పిచ్చివట్టినదె మీ కంచున్ ననున్ గేలిచే
సినవార్ కొందఱు. వారి వ్రాఁతె తెలుపుం జెల్వెల్ల నిం కెందుకీ
పునరుక్తంబనువారు కొందఱుసుమీ భూమీసురగ్రామణీ! 308

మ. ఇది సభ్యంబని నీకుఁ దోఁచునెడ నీవిద్దానికిన్ మేటియ
భ్యుదయంబుం గలిగింపనెంచునెడ సంపూర్ణానుమోదమ్ముతో
త్వదభిప్రాయవిశేషసూచకము చేవ్రాలుంచి లక్షించి శ్రీ
పదమౌన ట్లొనరింపుమో సహృదయా! భాస్వజ్జయంత్యన్వయా!

శా. ఏదో వెఱ్ఱిగ నిన్ని పద్యములు నా కేకాశుధారాగతిన్
ప్రాదుర్భూతములయ్యె లోకమునకున్ బాగో యటు ల్గాదో. నా
చేదస్తంబనుకొమ్ము. తోఁచినది నేఁజేతుం గవిత్వంబు. ను
న్మాదుల్ సత్కవు లొక్కక్లాసనుచు సంభావింతు రార్యోత్తముల్.

శా. ధారాశుద్ధియు దీనిలోఁ గలదు. శాస్త్రజ్ఞాన మిద్దాన వి
స్తారంబున్నది. సత్యతత్పరత కాస్థానంబ యీకబ్బ మో
ధీరోదార! జయంతి రామసుకవీ! దీనిన్ గ్రహింపంగద
య్యా. రావయ్య సమస్తసంపదలు నీ కౌనట్లు దీవించెదన్. 359

మ. ఇఁక నా రేమనియన్న నందులకు నే నేలేశముం గాని వ్రా
యక మీచిత్తమటన్నచో గురుఁడు సన్నాశీర్వచించున్. కవి
త్వకళన్ మిన్నక తిట్ట దానికిని నేఁ బ్రత్యుత్తరం బీఁదలం
పక యెట్లుండుదుఁ బుణ్యమబ్బినను బాపం బబ్బినం బిమ్మటన్?

ఇట్లు గ్రంథమంతయు జయంతి రామయ్యపంతులుగారినే సంబోధించి వారి కంకిత మిచ్చుటచేఁ గాఁబోలు దీనికి జయంతియని పేరుపెట్టిరి, వారి జయధ్వజమని కూడ స్ఫురించెడిని.

## —♦ శ్రీ శంకరస్వాములవారి దేశయాత్ర ♦—

(పల్లా చంద్రశేఖరశాస్త్రి, విరూపాక్షసంస్థానవిద్వాన్)

శ్రీశ్రీ జగద్గురు విరూపాక్షపీఠాధీశ్వరులగు సచ్చిదానందాభినవశంకరభారతీ స్వాములవారమరచింతసంస్థానీయుల రాజధానియగు నాత్మకూరునుండి గద్వాల సంస్థానాధీశ్వరియగు రాణి యాదిలక్ష్మీదేవమ్మగారిచే భక్త్యాదరపూర్వకముగా నాహ్వానింపఁబడి తద్రాజధానియగు గద్వాలలో నడ్డపల్లకిమొదలగు స్వీయానూనబిరుదములతోఁ దత్రత్య శిష్యవర్గముచే జరుపఁబడిన గ్రామోత్సవాదు లంగీకరించుచు నీ యీశ్వర సం॥ జ్యేష్ఠ శుక్ల దశమీతిథిం బ్రవేశించిరి. ఇచ్చట రాజభవనములో స్వీయాస్థానవిద్వద్బృందముచేఁ బ్రాతర్మధ్యాహ్న సాయంకాలములయందు జరుపఁబడు భాష్య ప్రవచనోపన్యాస కాలక్షేపములతోడను సువర్ణసైకతలింగ శ్రీచక్ర పూజా ద్యుత్సవములతోడను నానందభరితులై యున్నారు.

---

## —♦ పాపపుణ్యములు లేకపోలేదు ♦—

(యన్. రామమూర్తిగారు, బి. ఏ.,)

గోపాలకృష్ణయ్యగారు మనదేశ మితరదేశములకన్న నతిమాఢ్యదశయం దున్నదని...రి. దీనికిఁ గారణము మనలో ననేకులకుఁ బ్రకృతితత్వజ్ఞానము లేకపోవుటయే యనిరి. పైసిద్ధాంతమునఁగాని దాని కొసఁగిన కారణమునఁగాని యాధార మగుపడుటలేదు. వారు మాఢ్యమనఁగా Superstition అని భావించిరో లేక మూఢభావమని తలఁచిరో తెలియదు. Superstition అనుకొనినఁ బ్రతిదేశమందును నది లేకపోలేదు. మన దంత మూఢజాతియుఁ గాదు. ఇఁక మనకుఁ బ్రకృతితత్వజ్ఞానము లేదనుట మిక్కిలి శోచనీయము. మనలోఁ జాలమందికి వ్రాయను జదువను దెలియకపోయినను జ్ఞానము లేదనుకొనుట పొరపాటు. మన యాచారముల యవకతవక కవిద్యయే కారణమనుచున్నారు. బహుశః, ఐయుండవచ్చునేమో కాని యది యొకటియే కారణము కాదు. కాలమునుబట్టి యాచారములు మాఱుచుండును. అందుచే మానవదృష్టికిఁ బూర్వాచారములు కొఁ దేవగింపు చేయవచ్చును. అందువలన నాచారము లన్నియుఁ జెడ్డవనుట తప్పు. సదాచారములెన్నియో మనలోఁ గలవు. దురాచారములుఁ గొన్ని లేకపోలేదు. అట్టివి మనదేశములోనే కాదు. ప్రతిదేశమునఁ గలవు. పాటుపడినచో మనము వానిని దొలఁగింపవచ్చును. వ్యాసోద్దేశము వస్తుతత్వగ్రహణమే యనుచు జను లందఱు నిచ్చవచ్చిన పాపకార్యము లన్నియుఁ జేయవచ్చునని నాయభిప్రాయము కాదని తెల్పుచున్నారు. పాపపుణ్యములు లేవనుటయుఁ బాపకార్యముల వలదనుటయు విరుద్ధాభిప్రాయమును Contradiction సూచించుట లేదా? మంచిచెడ్డ లున్నవి. పాపపుణ్యములు లేవని మఱియొక వాదము. అవిలేవపు డివి యేమిటి? ఒకరి మంచి వేఱొకరికిఁ జెడ్డ. మంచియొనర్చినవాని జనులు పొగడుదురు. చెడ్డచేసిన దూషింతురు. అనఁగా మంచికార్యముల ఫలితము కీర్తి, దుష్కార్యముల ఫలిత మపకీర్తియని

తెలిసికొనఁదగును. ఎపుడు మంచిచెడ్డలకు ఫలితము లున్నవని యొప్పుకొందుమో యపుడే వానికిఁ బుణ్యపాపములను పేరులు గలుగును. ఆఫల మెపుడు కల్గునను ప్రశ్న యనవసరము.

పుణ్యకార్యముల ఫలితము పుణ్యముఁ బాపకార్యముల ఫలితము పాపము నని మనవారు నమ్ముట సిద్ధము. కర్మసిద్ధాంతములు నమ్మువా రందఱు దానిని నమ్మెదరు. ఈసిద్ధాంతములోని నిజము నిపుడు పాశ్చాత్యులుగూడ నమ్ముచున్నారు. మఱియు, శాస్త్రము (Science) Every action has got a reaction అని చెప్పుటలేదా? పై వాక్యార్థాలు వేఱున్నయున్నను గ్రియకుఁ బ్రతిక్రియ కలదనుట యొక యర్థము. అట్టిచో మన పైనమ్మకమునకు మన మసహ్యపడ నవసరములేదు. హైందవసంఘమునఁ బినతండ్రికొమరిత సోదరీతుల్యయగుట నిజము. ఆమెను వివాహమాడిన నరకప్రాప్తి లేదని గోపాలకృష్ణయ్యగారు తెలుపఁగలరా? మహమ్మదీయు లట్టివివాహము చేసికొనుట లేదాయని ప్రశ్న. నిజమే. వారిలో నూటికొకఁ డట్టివివాహము చేసికొనుట. ఆకార్యము తప్పే యైన దానిఫలము వాఁ డనుభవింపకపోఁడు. వారిలో ననేకులు నేఁ డట్టివివాహముల కిష్టపడుటలేదు. ఒకసృష్టిలో నొకకార్యము కొందఱకుఁ బాపముఁ గొందఱకుఁ బుణ్యమా యని వాదము. ఈసృష్టి విరుద్ధభావముల పోరాటము. ఒకని వేఱొకఁడు హత్యఁజేసిన వాఁడు పాపియగును. యుద్ధమునం దెంతమందిని జంపినను దప్పులేదని శాస్త్రములు చెప్పుచున్నవనుట సమ్మతమే. దేశకాలములఁబట్టి యొక కార్యఫలితము వేఱువేఱుగ నుండవచ్చును ఆఁకలియైనప్పు డన్నముతినుట మంచిదే కాని కడుపునొప్పి కలిగినపుడు తినుట శ్రమదాయకము. కార్య మొకటే యైనను నది యొకప్పుడు తప్పు నొకప్పు డొప్పు నగుచుండుట లేదా? అటులే మఱుఁగుస్థలమున మలమూత్రవిసర్జనము దోషముగాదు. రోడ్డుమీఁద శిక్షార్హము. న్యాయాధికారి తా వేసిన యురిశిక్షచే నొకరిని జంపుచున్నాఁడు. కాని యాతఁడు దోషిగాఁడు. ఒకఁడు వేఱొకని హత్యచేసిన నది తప్పని మనము పరిగణించుటలేదా? ఉద్దేశముంబట్టి కార్యముల ఫలితములు మాఱుచుండును. అటులే హత్య నేరమైన యుద్ధమున నది ధర్మము. (Duty) జంతుహింస కూడదుగాని యజ్ఞమున నది నియమితము. ఔషధము స్వతః, చెడ్డదైనను రోగికి గుణము గలిగించుటలేదా? గుడ్డకు మట్టిపూసికొనుట వికారముగాని పాత్రల మలము పోఁగొట్టుట కామట్టినే తోముట కుపయోగించుట లేదా? కానఁ జెడ్డచేఁగూడ మనకు మంచి కలుగును గొన్నివేళల. లోకమున గోహత్యాపాతకు లెందఱులేరు. వా రేపాపమునఁ బోవుచున్నారనునది మఱియొకప్రశ్న. అట్టివా రధికముగా నున్నారనఁగానే చేసినకార్యము మంచిదగునా? వా రెంత యపకీర్తికిఁ బాలగుచున్నారు? ఇది దానిఫలము కాదా? మఱియు, జన్మాంతరమున వారి కేమిగల్గునో యెవరికెఱుక ? దీనిఫలిత మనుభవించరని చెప్పఁగలమా? ఈలోకమునఁ బ్రస్తుతపరిస్థితి విచారించి పాపపుణ్యములు లేవని తీర్మానించుట దూరదృష్టి కాదు. బోయలు పక్షులఁ జంపుట, జాలరి చేఁపల వేఁటాడుట, న్యాయాధికారి

రెటు లురిశిక్ష విధించుచున్నాఁడో శస్త్రచికిత్సకారుఁ డెటు లవయవభాగము
ోయుచున్నాఁడో యటులే వారిధర్మమని తలఁచి పైవా రాపనులు చేయు
న్నారు. అది తప్పగునెడల దానిని వారు విరమించునటులు చేయవలయును గాని
పుణ్యపాపములు లేవనుట సమంజసము కాదు. పదిమంది శారదాబిల్లు నుల్లంఘించియు
క్షింపఁబడలేదు. శిక్షావళి పోయినదేమోయని భావించి పదునొకండవవాఁ డటులే
సేయఁగా వాఁడు పట్టుపడి శిక్షింపఁబడెను. కానమనము తీర్మానమును (Inference)
యుటలో జాగరూకత వహింపవలయును. బోయలు జాలరులుఁ బులులుఁ బందులు
ధికముగాఁ గష్టపడుటలేదేయని వేఱువాదము. వాని కష్టము వానికెఱుక. సాధా
ణముగా సుఖమును గమనించినంత కష్టమును గమనించకుండుట మానవస్వభావము...
ప్రపంచమున మాంసభక్షకు లధికులే, వారందఱు నేరూపమునఁబోవుచున్నారని
ప్రశ్న. మాంసభక్షణము మంచిదిగాదని వారే చెప్పుచున్నారు. దానివలన దేహ
మున కంత మేలు లేదనియు బుద్ధిమాంద్యము గలుగుననియుఁ దెల్పుచున్నారు.
మాంసభక్షణమను చెడ్డకార్యమునకు బుద్ధిమాంద్యమను ఫలిత మెపుడు కలిగినదో
యపుడే దానికిఁ బాపమని పేరుగలుగును. ప్రతికార్యమున మంచిచెడ్డ లుండును.
ది యధికముగానుండిన దానిఫల మనుభవింపక తీరదు. ధనవంతునో విద్వాంసునో
మాచినపుడు పూర్వకృతపుణ్యఫలమనుటలేదాయని మాట. అటులనక యిఁకెట్లు
నఁగలము? అదియే లేనిచోఁ బుట్టుకతోనే యొకఁడు కోటీశ్వరుఁడు నొకఁ డష్ట
దరిద్రుఁడు నగుట యేల? బుడుతఁడయ్యు విద్యాపరిపూర్ణుఁడగుచున్నాఁడే యెట్లు?
డియంతయుఁ బ్రయత్నమువలనఁ గలుగఁగలదనియెదరేమో? మనప్రయత్నము
లేకయే జరుగుచున్నవే. వాని నెట్లుచెప్పఁగలము? ఆరోగ్యవంతులగు దంపతులకుఁ
కురూపులు వికలాంగులుఁ బుట్టుటయేల? బిడ్డలోయని యేడ్చువారికిఁ బ్రయత్న మెంత
చేసినను గలుగుటలేదే? విద్వాంసుని బిడ్డ మొద్దగుటలేదా? మహాత్ముని బిడ్డఁడు
దురాత్ముఁడగుటలేదా? కష్టపడినను మొద్దు మొద్దుగనే యుండుటలేదా? దిన
మంతయుఁ బ్రయత్నించి కష్టపడినను రువ్వదొరకదే? వేఱొకనికిఁ బ్రయత్నము
లేక యొకదారిలో నమూల్యములు లభ్యమగుచున్నవే. దోషి తప్పకొనుచున్నాఁడు.
నేరముచేయక వేఱొకఁడు శిక్షింపఁబడుచున్నాఁడు. దీనికిఁ గారణము వానివాని
పూర్వజన్మకృతఫలము గాకుండిన మఱి యేది? గాడిద మొదలగు జన్మలు నీచ
జన్మలు గావనినాఁడు. అవి నీచజన్మలని మన శాస్త్రజ్ఞులు వ్రాయుట యసత్యపు
గ్రాఁతలన్నాఁడు. కాని యటుల వ్రాయుటలో వారి యుద్దేశము లోకకల్యాణాభి
లాషయనినాఁడు. గాడిద మొదలగుజన్మల గర్హించుట లోకకల్యాణమగునా?
నిలో విరుద్ధ మగుపడుటలేదా? మానవలోకమునఁగల ప్రేమ యితరజీవులపై
సమ్యత గోచరించుటలేదా? అంతియేకాని హైందవశాస్త్రజ్ఞులు వస్తుతత్త్వజ్ఞాన
హీనులను టనుచితము. పంది కేపాపముచే నిట్టిజన్మ మెత్తినది తెలియకపోయినను
నేదియో యొక పాపముచేతనే లభ్యపడినది. పంది సుఖముగ బురదలోఁ బొర
లాడుచున్నది కాని కష్టపడుటలేదేయనుచున్నారు. పాపము పందికష్టము గోపాల
పషయ్యగారి కెటులఁదెలియఁగలదు? పెండామ బిడను గనినదనఁగానే చరసంతో

షించునే కాని యాకార్యమున భార్యపడిన యవస్థ గ్రహింపఁగల్గునా? అనుభవించు నాయమకుఁ దెలియును గాని, పైవిషయముల గమనించిన మంచిచెడ్డలుఁ బాపపుణ్యములు నున్నవని యొప్పుకొనక తప్పదు. అయిన నీపాపమున కీశిక్ష యీపుణ్యమున కీఫలము నని ప్రతివో నిర్ణయింపఁజాలము. కాని వానిఫలములు నేఁడో రేపో కలుగును. పాపభీతిని దుష్కార్యములనుండి విరమించుకొనినవా రనేకులు లోకమున లేకపోలేదు. లోకము పాపభూయిష్ఠమగునప్పుడు ప్రళయ మేదో కలుగక మానదు. సహగమనము నిల్చిపోయినదే, దానిఫలము మన మనుభవించుటలేదే యనుట తప్పు. ఏమో, మన మనుభవించు కష్టములలో నొకభాగము దానివలనఁ గాఁబోలు. లేక సహగమనము మంచికార్యము కానిచో దానిని విరమించుటయు నుచితమే. ఒక కార్యము పాపభూయిష్ఠమా పుణ్యమా యని తర్కింపవచ్చును గాని, లోకమునఁ బాపపుణ్యములు లేవనుట తప్పు. వానిఫలము నేడో రేపో జన్మాంతరముననో కలుగవచ్చును. జన్మాంతరము మనకే కాని దైవదృష్టిలోఁ గాలము మొదలుఁ దుది లేనిది. అట్లని యెల్లపుడుఁ బుణ్యపాపముల వితర్కించుకొనుచుఁ గార్యములు చేయుచుండుఁ డని చెప్పను. మానవులు చుఱుకుగనే పనిచేయుచుండవలయును. పాపపుణ్యములను మనస్సాక్షియే నిర్ణయించును...

---

## —♦ వేంకటేశప్రభువు ♦—

(మేడవరము సత్యనారాయణశాస్త్రిగారు)

శా. ఉద్యోగం బనరాదులే. కనుల జోడో నెత్తిఁ గ్రాఫో సభా
హృద్యంబౌ తలపాగయో మఱియు నిస్త్రీదుస్తులో లే. విసీ!
విద్యాబుద్ధు లటుండనీ మొదలు కాఫీత్రాఁగుటే లేని మా
పద్యా లెవ్వరు కండ్లఁజూడవలె దేవా! వేంకటేశప్రభూ!

మ. కవినంచున్ వచియింతు. చేతి కొక ట్రింకా లేను. హాండ్వాచి లే
దు. విచారింప స్పెషల్ ట్రెయిన్లపయి నందున్ ఫస్ట్ సెకండ్క్లాస్ టికె
ట్ల విశేషంబుగఁ దీయ. ఈవలను మోటార్ కార్లపై రాను. న
న్నెవరిచ్చోఁ గవినంచు నమ్మెదరు తండ్రీ; వేంకటేశప్రభూ!

---

## —♦ హిందువులు బానిసలా? హిందూదేశము బానిసదేశమా ♦—

(గాదేపల్లి వీరరాఘవశాస్త్రిగారు, గద్వాలసంస్థానపండితులు)

సీ. బానిసదేశమా? ప్రాణావశిష్టుఁడై
అనిఁ దూలు గజనీమహమ్మ దెఱుఁగు.

బానిసదేశమా? ప్రాణాల నొల్లక
బందిపోట్లయిన యఫ్గనుల కెఱుక.
బానిసదేశమా? భూనిరంతరనాక
ముగ నేలు సార్వభౌములకె యెఱుక.
బానిసదేశమా? తాను జన్మస్థలి
కోల్పుచ్చి యేలిన గోరి కెఱుక.
గీ. బానిసల హిందువుల్? భవ జ్ఞానపదిక
హీన వైషమ్యకార్యక్రియానుయాయి
కర్మనిర్మూలనాభ్యాసధర్మశాంత
శమదమాధిష్ఠితాత్మనిశ్చయులు దయులు.

సీ. తోఁచిన దెల్ల నిర్దుష్టవాక్యంబని
డంకాబజాయింపఁ గొంకులేద ?
ముందనుచో వెన్కముందుల నరయక
తనకాళ్ళతోఁ దట్టుకొనుట కలద ?
దేబె లెవ్వరో తోఁక తెగి నల్వు రరుదెంచు
దేశికత్వమె మెడ తిరుగలేద ?
హరయతీతియటంచు హరిజనపదమను
వ్యక్తి దయానంద వంచనంబొ ?
ఇల నపక్వసుశైలోన గలబరించు
కలికి లక్ష్యార్థమె యెటో పలికినంత
నోరు చెడె. ఒక్కసారి కపీరుననుము
తారకంబగు పాతకోత్తారకంబు. 1

మ. వెకలీ! మాభరతావనీసతి హృదావిర్భూతిమైఁ గొన్నినా
ళ్ళకలంకస్థితి మోచి కన్నకడుపై యాఁచెన్ భవద్వాక్య. మిం
కొకదేశస్థుఁ డిటుల్ వచింప నపుడే యోగ్యేతరుండంచుఁ గు
త్తుక నొక్కింపదె పుత్రులం బిలిచి? హిందూబానిసా? నీనిషా? 3

ఉ. నాయనలున్ మఱిం కటులె నాయన నాయనలుం జిరంతనా
మ్నాయ నయానుయాయి సుషమాకృపిమూల మదీయదేశమా

త్రాయతజన్మజన్మలయి యాయము చన్నుల పాలు ద్రావి యా
రా! యిటు బానిసన్న నగరా? యగరా జెటులాడఁ జేసెరా? 4

ఉ. కేవల మెన్నఁడేగనో హాకీము లమీర్లును బీర్లు. పాదుషాల్
పావనజన్మభూమి పరిపాలనఁ జేయుచుఁ బ్రార్థనాలయో
జీవకముం బొనర్చిన ప్రసిద్ధ భవత్పదవాస మిండియా.
యావనులైన మీ మృదు హృదంతరభావము లింతపాటివా ? 5

శా. మక్కా మ్రొక్కుల నంకురించి నిగమాంభస్సేకసారంబునన్
ముక్కారుల్ ఫలియించు జ్ఞానకళలన్ మొల్పించి పండించు మా
దక్కన్ ముఖ్య సమస్తహైందవపదాధారంబునన్ వృద్ధియై
దిక్కుల్ గ్రక్కదలన్ భవత్కులజు లిందే యేలి కన్ దూర్పరే ?

తే. గీ. బానిసలు వీర ? వైరిరాట్పటలనిటల
తటమకుటసంఘటితరత్నతరుణకిరణ
నికరకరదీపికాజగన్నేతృరాజ
సూయయాగావభృథులని చూచుకొనుము. 7

సీ. మక్కాలలో నెన్ని మ్రొక్కులు మ్రొక్కిన
భారతావనిఁ జొరఁబడుటకొఱకె.
ఘోరయుద్ధము లెన్ని సారు లొనర్చిన
భారతీయుల భోగభాగ్యములకె.
జంకిపాఱుచు నెన్నిసార్లరుదెంచిన
హిందూమహారాజ్య మేలుకొఱకె.
జన్మభూమిని వీడి సొంత మిం దుండుట
హైందవసుజన సౌఖ్యంబుకొఱకె.
ఇదియె బానిసరాజ్యమై యిచటిప్రజలు
బానిసలె యైన నున్నతపదవిఁ బొదలు
ధీరగుణులకుఁ దమకు విదేశ్యతతికి
ఇందుఁ బనియేమి ? మఱి తొత్తుక్రిందఁ దొత్తు ? 8

---

## —* పురోహితులు *—

జ్ఞానము వృద్ధియైనకొలఁదిఁ బ్రతిగృహస్థుఁడు నిహమునందును బరమునందును కష్టములను దొలఁగించుకొనుటకును సుఖమును సంపాదించుటకును బ్రయత్నించు సాధనములలో ముఖ్యసాధనము పురోహితుఁడు. నావకుఁ జుక్కాని యెంతయుపయోగమో గృహస్థునకుఁ బురోహితుఁడు నంతియు. ఇంకను జుక్కాని నావకు వెనుక నుండుటచేఁ గొన్ని సందర్భములలోఁ గనుపడుచుండును. కాని పురో ధావతీతి పురోధా యను వ్యుత్పత్తిని బట్టి పురోహితుఁ డెప్పుడును గృహస్థునకుఁ గాగడావలె ముందే నిలిచి సర్వగార్హస్థ్యధర్మములకును మార్గదర్శకుఁడై చతుర్విధపురుషార్థములను హస్తగత నవనీతమువలె లభింపఁజేయును. కావునఁ బురోహితుఁడు తొలుత నుండియు గృహస్థునకుఁ బరమపూజ్యుఁడైనాఁడు. ఇట్లే పూర్వకాలమున మనకు మహోపకారములని యెంచి యెన్నో కట్టుదిట్టములు చేయఁబడఁగా నవి యిప్పుడు రానురాను దేశము చేసికొన్న పాపముచొప్పున మహాపకారకములై పరిణమించినవి. ఈ పురోహితకృత్యముఁగూడ నట్లే యిప్పుడు కేవలమును గృహస్థున కెట్టియుపకారమును లేదు సరేకదా! విశేషించి వాని నాశనమునకు సర్వవిధముల నుపయోగించుచున్నది. వేయి చెప్పనేల? గృహస్థులను సర్వవిధములను బాధచేయుచున్న దీ పురోహితులే. వీరు చల్లఁగ గృహస్థులయొద్దఁ జేరి 'చిత్తము ప్రభువుగారు! హోహోహో! మాజీవనమే మీది, మీయాశ్రితులము' అని మెత్తమెత్తగాఁ గబుర్లు చెప్పుచు ననేకకారణములు కల్పించి వాని సర్వస్వమును గుంజుకొని వానిని దుదకుఁ బరమదరిద్రుని జేయుచున్నారు. దీనికి దృష్టాంతము లోకములో నెందఱు సంపన్నగృహస్థులు పరమదరిద్రులైనారో యెందఱు పురోహితులు తొలుత నన్నమెట్టిదో యెఱుఁగనివా రిప్పుడు ద్రవ్యమార్జించియున్నారో విమర్శించినచోఁ జక్కఁగాఁ దెలియఁగలదు. వీరు గృహస్థుల ద్రవ్యము లాగుటకై పన్ను వ్యూహములను వర్ణించుటకుఁ బదజాలము లేదు. వితంతువులయొద్దఁ జేరి వారి కరచేతిలో వైకుంఠముఁ జూపెదమని భ్రమపెట్టి లక్షవర్తివ్రతములనియు క్షీరాబ్ధివ్రతములనియు నిత్యసువాసినీవ్రతములనియు భర్తృమోక్షవ్రతములనియు భర్తృలోకసాయుజ్యవ్రతములనియుఁ బ్రతిదినము నెన్నియో బొల్లివ్రతములు కల్పించి యింతింతయనరాని సొమ్మును దోఁచుకొనుచున్నారు. ఇంతతోఁ బోక కాశీరామేశ్వరాది తీర్థయాత్రలనుగూర్చి రసపోషణముగా వర్ణించుచు మార్గాయాసాదులకు భయపడుచున్న యా యమాయికలతో 'నమ్మగారూ! ఎంతసేపు? మిమ్ములను బువ్వులలోఁ గూర్చుండఁబెట్టి యాత్రచేయించి పదునేనవరోజు నాఁటికి మీయింటఁ బ్రవేశింపఁజేసెదు పూచీ నాది'యని గుండెలుకొట్టుకొని బలవంతమున బయలుదేఱఁదీసి యందందు వన్నెవన్నె దానముల పేరఁజెప్పి తెచ్చిన దంతయుఁ గాఁజేసి యింకను జాలక యిండ్లకుఁ దెలిగ్రాములుకూడ నిప్పించి సర్వమును దోఁచుకొని వట్టిముండల నిండ్లలోఁ బ్రవేశపెట్టుచున్నారు. కొందఱింకను జెప్పరాని దుష్కార్యములలో వారిని దింపి భ్రష్టలను జేయుచున్నారు. అసలు యజమానులయొద్ద నిఁకఁ జెప్పనే యక్కఱలేదు. సత్య

పారాయణవ్రతములు వేంకటేశ్వరుని దీపారాధనములు విఘ్నేశ్వరపూజలు పుణ్యాహవాచనములు భూరిసంభావనలు గోహిరణ్యాదిదానములు మున్నగువాని పేరుచెప్పి ద్రవ్యమును నీరు గూడతోఁ దోఁడినట్లు తోఁడివేయుచున్నారు.

ఇంతతోఁ బోక కొంచెము కాలిలో వెన్నున కాఁగానే గ్రహజపములనియు శాంతులనియుఁ జెప్పి పెండ్లము మెడలోని పుస్తెల నమ్మించుచున్నారు. మఱియు నొకప్పుడు ప్రయోగలక్షణమని పిరికిమందుఁ బోసి భూతవైద్యపు దొంగలతోఁ జేరి వారుచెప్పెడు తంత్రముల ననుసరించి యిండ్లలో రాళ్ళువిసరియు బొగ్గులు చిమ్మియు నేమాయుమూలగుడ్డలనో తగులఁబెట్టియు నిట్టే వెల్లినమ్మకములు పుట్టించి డబ్బులాగి యాదొంగలతోఁ గలసి పంచుకొనుచున్నారు. దీనినిగూర్చి ప్రత్యేకించి యొక గ్రంథము వ్రాయవలెను. అహా! వీరివలనఁగలుగు నిజమైన సదుపదేశము నిక్కమైన సహాయముఁ బూచికపుడకంతయైన నుండునేమో యోజింపుఁడు. తమకు 4 డబ్బులు చేతిలోఁబడినయెడల నెట్టియసంస్కారములనైనఁ జేయింతురు. ఎట్టిమౌఢ్యములలోనైనను దుర్ముహూర్తములలోనైనను పెండ్లిండ్లుచేయింతురు. తమకు దొంగతనముగా నెత్తుకొనివచ్చిన పిల్లకైనను నేచావడిలోనో ముడిపెట్టింతురు. హా! వీరికి ధన్యవాదము. గృహస్థులీపురోహితనామక గ్రహములను గనిపెట్టి మెసలుచుందురుగాక. (1-3-1914 వ సుదర్శని)

ఈవ్యాసమునకు గుఱిగాని సత్పురోహితులు కొందఱుండవచ్చును గాని పెక్కుండ్రయెడల నిది యన్వర్థమగుటకు సంశయము లేదు. మంచి వైనను గాకున్నను దమకుఁ దీరికచిక్కిన దినములలో బాపురుల యిండ్ల శుభాశుభకార్యములు నిర్దేశించి చేయించుటయుఁ బురిటితో మూగ్నలగు వైశ్యులయిండ్లఁ బెండ్లిండ్లు చేయించుటయు నట్లే మూర్ఖబ్రాహ్మణులకుఁ బురిటియన్నముఁ బెట్టుటయునే కాక యా పురిటితోనే యమాయికబ్రాహ్మణగృహస్థులయిండ్ల శ్రాద్ధభోక్తలగుటకుఁగూడ జంకని పండితంమన్యులైన మా గ్రామపురోహితులఁ జూచి 23 సం॥ల నాఁడు ప్రకటింపఁబడిన యీవ్యాసము మరల నీపత్రికలోఁ బ్రకటింపవలసివచ్చినదని గ్రహింతురుగాక.

అ॥ స॥ సం॥

---

## —♦ జ్ఞాతిశత్రువు ♦—

( శ్రీనాథుని కాశీఖండము )

తే. శాస్త్ర మాచార్యసన్నిధిఁ జదువఁడేని
ఇద్ధబోధంబు మది సంగ్రహింపఁడేని
తెగువమీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయమందఁడేని తజ్జనుఁడు జనుఁడె ! ప్ర. ఆ. 107

ఉ. కంటికి నిద్రవచ్చునె, సుఖంబగునే రతికేళి, జిహ్వకుఁ
వంటక మిందునే, యితరవైభవముల్ పదివేలు మానసం

బంటునె, మానుషంబుగలయట్టిమనుష్యున కెన్నఁడేనియున్
కంటకుఁడైన శాత్రవుఁ డొకండు తనంతటివాఁడు గల్గినన్? 108
కం. ఎవ్వనితో నెచ్చోటం జివ్వకుఁజేసాఁచవలదు. చేసాఁచినచో
ఇవ్వలనవ్వల నెవ్వరు నవ్వకయుండంగఁ బగర నణఁగింపఁదగున్.
శా. ఆచందంబున నంతరంగమున కత్యంతంబు తీవ్రవ్యథా
ప్రాచుర్యంబు ఘటింపఁజాల దతిఘోరంబైన దావానలం
బేచందంబున నంతరంగమున కిల్లే జ్ఞాతిభూభృజ్జిగీ
షాచింతాభర మావహించు నతిదుస్సాధ్యవ్యథాభారమున్. 110

---

## —♦ అప్పయదీక్షితులు ♦—

( మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సంస్కృతకవిజీవితము నుండి )

ఈశ్వరుఁడు కలియుగములో మొదట శంకరాచార్యావతారమెత్తి మరల నప్పయదీక్షితులై పుట్టెనని మన వేత్తల యభిప్రాయము. ఈమహాత్ముని చరిత మొకరిద్దఱు సంస్కృతాంధ్రములలో వ్రాసియుండుటచేఁ గవిప్రశంసాపరముగా నిందు సంగ్రహించి వ్రాయుచున్నాను. కాంచీమండలములోని యడపోలమను గ్రామ మీతని నివాసము. ఇతఁడు భారద్వాజగోత్రుఁడు. ఈతని పితామహుఁ డాచార్యసర్వతోముఖమహావ్రతయాజి. తండ్రి విశ్వజిద్యాజి రంగరాజమఖి. ఈవిషయ మీతని మధ్వతంత్రముఖమర్దనము చివరి "విద్వద్గురో ర్విహిత విశ్వజిదధ్వరస్య శ్రీసర్వతోముఖ మహావ్రతయాజిసూనోః, శ్రీరంగరాజమఖిన శ్శ్రితచంద్రమౌళే రస్త్యప్పదీక్షితఇతి ప్రథిత స్తనూజః॥ సోయం మితపద మకరో న్మహితార్థం మధ్వతంత్రముఖభంగం, ప్రీత్యై పురామరారే శ్శ్రీకామాక్షీసమేతస్య" అను శ్లోకమువలనఁ దెలియుచున్నది. ఇతఁడు 12 సం॥ లకే వేదము సాంతముగాఁ జదివి పిదప నెల్లశాస్త్రములయందుఁ గృతపరిశ్రముఁడై యద్వైతశాస్త్రనిధియై తత్కాలమందలి వైష్ణవుల యౌద్ధత్యంబు సహింపక వీరశైవమతస్థాపకుఁడై శివభక్తుఁడై శైవమతపరముగా ననేకగ్రంథము లొనరించి యనేక వైష్ణవుల ధిక్కరించి యనేక దేశంబులఁ దిరిగి యనేకరాజుల సభల సన్మానంబు వడసి కావేరీనదీతీరంబున ననేక క్రతువులు సలిపి వేత్తయై ముముక్షువై కాశికిఁ బోవుచుఁ దన భక్తుల నిర్బంధమునఁ జిదంబరములోఁ గొంతకాల ముండి యందే 70 సం॥ల వయస్సున శరీరము పరిత్యజించెనని యితని జీవనచరితసంగ్రహము తెలియుచున్నది. ఈమహాకవి క్రీ॥ 1585, 1614 నడుమఁ జంద్రగిరి రాజధానిగాఁ గర్ణాటదేశము నేలినవాఁడును గృష్ణదేవరాయల కుటుంబములోనివాఁడును నగు వెంకటపతిరాయల యాస్థానంబున నున్నట్లీతని కువలయానం దాంతిమపు "అముం కువలయానంద మకరో దప్పదీక్షితః నియోగా ద్వేంకటపతే ర్నిరుపాధికృపానిధేః" అను శ్లోకంబునఁ దెలియుటచే నీతను నతని గురువగు తిరుమలతాతాచార్యుని శాస్త్రవాదంబున నోడించి యాతని

వలన సమ్మానంబు నొందినవాఁడని లోకప్రసిద్ధముగా నుండుటచేతను నితని సోదరుని పౌత్రుఁడగు నీలకంఠదీక్షితులు క్రీ॥ 1636లో నీలకంఠచంపువు రచించినట్లా కావ్యాద్యపు

శ్లో॥ అష్టత్రింశ దుపస్కృత సప్తశతాధిక చతుస్సహస్రేషు
కలివర్షేషు గతేషు గ్రథితః కిల నీలకంఠవిజయోఽయం.

అనుపద్యంబుననే తెలియుచుండుటచేతను, క్రీ॥ 1550, 1620 నడుమ జీవించియున్నవాఁడని స్పష్టమగుచున్నది. ఈతని సామర్థ్య మాహాత్మ్యములను గూర్చి యనేక కథలు లోకములోఁ గలవుకాని వాని తత్త్వమును లోకమే యెఱుంగునని యిందు వ్రాయఁ బూనలేదు. ఎట్లయిన నీతఁడు వైష్ణవమతస్థులతోఁ బెద్ద విరోధము పెట్టుకొని పెక్కుసార్లు వారిని జయించినవాఁడనుట స్పష్టము. ఇతఁడు శివకర్ణామృతము శివతత్త్వవివేకము శివాదిత్యమణిదీపిక శైవాద్వైతనిర్ణయము శివార్చనచంద్రిక వీరశైవము, ఆత్మార్పణస్తుతి, ఉపక్రమపరాక్రమము చతుర్మతసారసంగ్రహము చంద్రకలాస్తుతినామసంగ్రహమాల బ్రహ్మతర్కస్తవము భక్తిశతకము వరదరాజస్తవము వాదనక్షత్రమాలిక రత్నత్రయపరీక్ష విధిరసాయనసుఖోపజీవిని వృత్తివార్తికము భారతతాత్పర్యసంగ్రహము రామాయణసారస్తవము హరివంశసారచరితము శబ్దప్రకాశము మధ్వతంత్రముఖమర్దనము కువలయానందము దశకుమారచరితసంక్షేపము శారీరకన్యాయరక్షామణి సిద్ధాంతలేశసంగ్రహము రసికజనరంజని (కువలయానందటీక) చిత్రమీమాంస వైరాగ్యశతకము మొదలుగా 100 గ్రంథములు రచించినట్లు తెలియుచున్నది. ఇందుఁ గొన్ని యముద్రితములై యున్నవి. మఱికొన్ని నామమాత్రావశిష్టంబులై యున్నవి. అలంకారగ్రంథములగు కువలయానంద చిత్రమీమాంసలు మాత్రము లోకప్రఖ్యాతిం గాంచియున్నవి. నగృహీతం శ్రుతి హృదయం, నచ నగృహీతం పరిప్లవం హృదయం। ఇచ్ఛామిచ ధామ పరం గచ్ఛామితు విశ్వనాథపురీ మను శ్లోకమును బట్టి యీతఁడు కాశికిఁ బోవఁదలఁచిన కాలమున వైరాగ్యశతకము నిర్మించినట్లు కనఁబడుచున్నది. ఇది వేదాంతసారంబై యెల్లవిధముల భర్తృహరి వైరాగ్యశతకమును స్మరింపఁజేయుచున్నది. ఇతఁడు వెంకటపతిరాయల యానతిచే జయదేవకవి చంద్రాలోకములోని శ్లోకములనే లక్షణముగా గ్రహించి వివరించి సర్వాలంకారలక్ష్యలక్షణంబులతోఁ గువలయానందము రచించి దానికి స్వయముగా రసికజనరంజనియను వ్యాఖ్య రచించినట్లు తెలియుచున్నది. కాని యావ్యాఖ్య యిప్పు డెందును గానరాదు. రామచంద్రసూరి పుత్రుఁడగు వైద్యనాథపండితుని యలంకారచంద్రికతోఁగూడిన యీకువలయానందము సార్థకముగా నలంకారంబులకు సత్ప్రమాణముగా లోకోపకారము గావించుచున్నది. మొదటఁ బద్యకావ్యములుగా రచించిన మధ్వతంత్ర ముఖమర్దన శివకర్ణామృతములకు స్వయముగా నితఁడే వ్యాఖ్యానములు రచించెను. ఏకారణంబుననో సమాప్తముకాని యలంకారగ్రంథమగు నీతని చిత్రమీమాంసపై నితనికి వార్ధకదశలో సమకాలికుఁడగు పండితరాజ జగన్నాథకవి ఖండనము చేసెను. ఈచిత్రమీమాంస నప్పయదీక్షితులు వ్రాయుచున్న కాలములోనే పండితరాయఁడు

దీనిపై ఖండనము ప్రారంభించెననియు నందుచే దీని సమాప్తి గావింపకయే దీక్షితులు విడిచినట్లును లోకప్రవాదము గలదు. కువలయానందము రూపకప్రకరణములో నున్న చిత్రమీమాంసాయాం ద్రష్టవ్యమను వాక్యమును బట్టి కువలయానందమునకంటె దీనినే పూర్వము రచించినట్లు కనుపట్టుచున్నది. అందుచేఁ బై లోకప్రవాదము సత్యమే యైయుండవలెననియు లేదా దాని పరభాగము పండితరాయలచే సంభవింపకుండవలెననియుఁ దోఁచుచున్నది. ఎట్లయినను వీరిరువురు కొంచెము కాలము సమకాలికులై యుండిరనుట సత్యమని నమ్మఁదగినది. దీక్షితుల కవిత్వము మిగుల హృదయరంజకముగా సుగమముగా నుండును. శైలి తెలుపుట కొక్క పద్యముదాహరించెదను.

శ్లో. ప్రాదేశమాత్ర ముదరం పరిపూరయితుం కియా నయం యత్నః
చులకే నాంభః పాతుం ఖనితవ్యః కిం తటాకోఽపి ?

---

## —♦ గోకర్ణము ♦—

(నాగపూడి కుప్పుస్వామయ్యగారు)

(శృంగేరి...స్వాములవారి చరిత్రనుండి)

గోకర్ణక్షేత్రము పశ్చిమసముద్రతీరమున నున్నది. అచ్చట మహాబలేశ్వరస్వామి లింగము పశ్చిమాభిముఖమై యావిర్భవించియున్నది. అందుచే నీక్షేత్రము సర్వోత్తమంబని పురాణప్రసిద్ధమై యున్నది. ఆక్షేత్రము దర్శనము చేయుటకై భరతఖండమందలి యన్నిచోటులనుండియు హిందూమతస్థులగు సకలజాతిజనులును విశేషముగా వచ్చుచున్నారు. ఆదేవస్థానమునందుఁ బంచమజాతివారు దక్కఁ దక్కిన సకలజనులును భేదములేక గర్భగృహముం జొచ్చి స్వహస్తముతో దేవునకుఁ బూజచేయు పద్ధతి యనాదిగా నేర్పడియున్నది. రామాయణమునందుఁ జెప్పఁబడిన లంకాధిపతియగు రావణుఁడు తొల్లి కైలాసమునం దుగ్రతపం బొనరించి పరమేశ్వరుం బ్రసన్నుఁ గావించి యమ్మహాదేవుం డనుగ్రహించిన లింగమును లంకయందుఁ బ్రతిష్ఠించి పూజింప నెంచి తీసికొని వచ్చుచుండఁగా గోకర్ణక్షేత్రమున్న చోటికి వచ్చినపుడు చేతనున్న లింగమును బుడమిపైఁ బెట్టవలసిన యావశ్యకం బొదవెనియు భూమిపైఁ బెట్టనొల్లక చింతించుచుండఁగా గణపతి యచ్చటికి వచ్చినట్లును రావణుఁ డతనితోఁ దన చేనున్న శివలింగము నించుకసేపు పట్టుకొని యుండుమని చెప్పఁగా గణపతి వల్లెయని తాను మూడుమాఱులు పిలుచునంతలో నీవు రావలయును, రాకున్నచో లింగము నేలపైనుంచి వెడలిపోవునట్లు నిర్ణయము చేసికొని రావణుని 3 సారులు పిలుచునంతలో నతఁడు రాకుండఁగా లింగమును భూమిపైఁబెట్టి వెడలిపోయినట్లును రావణాసురుఁడు వచ్చి పుడమిపైఁ బెట్టఁబడియుండిన లింగమును హస్తములచే నెత్తుట కెంతప్రయత్నము చేసియు నశక్యముగా నుండినట్లును దన యావచ్ఛక్తి నుపయోగించి పెల్లగింపఁ బ్రయత్నించియు నది

సమూలముగాఁ బైకి రాక కొంచెము భాగము భూమిలో నిలిచిపోయెననియు నందుపై నిది యీశ్వరసంకల్పమని తలఁచి యచ్చటనే దానిం బూజించి విఫల మనోరథుండై రావణుఁడు లంకకుఁ జనెననియు నితిహాసము గలదు. ఆలింగము యొక్క యాకారమును జూచినచో నీయితిహాసమందు నమ్మకము గలుగునట్లున్నది. ఈక్షేత్రమందు మహాశివరాత్రినాఁడు దేవుని దర్శించి పూజాదికములు సేయుట మహావిశేషంబని యీదినమందు మూడునాలుగు లక్షల జను లాక్షేత్రమునకు వాడుకగా వచ్చుచుందురు.

---

## —♦ గోలకొండ ♦—

(శేషాద్రిరమణకవులు)

ఇది యపూర్వవైభవములందిన దుర్గరాజము. హైదరాబాదున కెనిమిదిమైళ్ల దూరములో నున్నది. ఈదుర్గము పరిపాలించిన యిభరాముల్కు లాంధ్రకవుల నాదరించెను. కుతుబుషాకు మంత్రులుగానున్న యక్కన్న మాదన్న లీదుర్గమునఁ జిరకాలము మంత్రిపదవిలో నుండి యౌరంగజేబు దుస్తంత్రములచే దుర్మరణమునకుఁ బాల్పడిరి. అక్కన్న తల యేనుఁగుకాలిక్రిందఁ ద్రొక్కింపఁబడెను. మాదన్న తల ఢిల్లీకిఁ బంపఁబడెను. ఆంధ్రవీరులగు నక్కన్న మాదన్నల క్షాత్రరక్తము దుస్తంత్రములచేఁ బ్రవహింపఁబడిన దీక్షేత్రముననే. రామదాసును బంధించిన గోలకొండ దుర్గపాలకుఁడగు తానీషాసైత మౌరంగజేబుచే బంధింపఁబడి దేవగిరిలోని యొక చెఱసాలలో నుంపఁబడెను. గోలకొండలో నున్న సమస్తసంపదలు నౌరంగజేబు హరించి తన ప్రతినిధిని గోలకొండదుర్గమున నుంచెను. క్రీ|| 1701 లోఁ దానీషా దేవగిరియందు మృతుఁడయ్యెను. దేవగిరిలోఁ దానీషా సమాధి గలదు. గోలకొండలో రామదాసును బంధించిన స్థలము గలదు. చరిత్రపరిశోధకులగు యువకు లక్కన్న మాదన్నలు ఘోరమరణమొందిన స్థలముగూడ గుర్తించి శాంతిచిహ్నములు స్థాపించుట యావశ్యకధర్మములలో నొకటి.

---

## —* { కవిత్వములోఁ గులతత్త్వానకుఁ దావులేదు<br>బ్రాహ్మణేతరకవిసమ్మేళనాధ్యక్షకోపన్యాసవిమర్శ } *—

(రాచరాజు కృష్ణమూర్తిగారు)

ఆంధ్రపత్రిక **2-6-37** సంచికయందుఁ బైశీర్షికగలదానియందు శ్రీ తాపీ ధర్మారావునాయఁడుగారి యధ్యక్షకోపన్యాసమును బత్రికాపాఠకులు తిలకించియే యుందురు. అందు బ్రాహ్మణేతరకవిసమ్మేళనసందర్భమున నాయఁడుగారివంటి ప్రాజ్ఞులు తమ విజ్ఞాన మంతయు మూలధనముగా దాఁచుకొని చెప్పినవిషయమును గూర్చి కొంచెము విమర్శింపక తప్పనిదగుటచే నాయఁడుగారును బాఠకసోదరులును మన్నించి గుణగ్రహణమే ప్రధానముగా నెంచవలెనని మఱిమఱి వేఁడికోలు. నాయఁడుగారు కావించినప్రసంగ మసంగతమని యెట్టివారికైనఁ దెలియకపోదు. "బ్రాహ్మణేతరకవులకుఁ బ్రత్యేకశ్రద్ధ కలుగఁజేయవలెను. అయినను గొంచెమో గొప్పయో బ్రహ్మద్వేష మున్నదనక తప్పదు. నన్నయ భారతములోఁ గాసటబీసట

యని బ్రాహ్మణేతరకవిత్వమును ద్వేషించినాఁడు, బ్రాహ్మణేతరనింద మొదట బ్రాహ్మణులే మొదలుపెట్టిరి" అని వ్రాసిరి. మొదటిశీర్షికలోఁ గులతత్త్వమునకుఁ దావులేదని వ్రాసి బ్రాహ్మణేతరకవులకుఁ బ్రత్యేకశ్రద్ధ కలుగఁజేయవలెననుటయు బ్రాహ్మణద్వేష ముండక తప్పదనుటయు నెట్లున్నదన నాత్మస్తుతియుఁ బరనిందయు ధనకాంక్షయు లేని మహానుభావుఁడనగు నాకును నేమియుఁ దెలియని శుంఠకును నొక్కరూపాయియే పారితోషికమా యనువానివలె నున్నది. ఇందుఁ బరిపూర్ణబ్రహ్మద్వేషము కేంద్రీకరింపకపోవుట కేమయినఁ దావున్నదా? నన్నయ యిప్పటి నాగరకప్రపంచనాటకరంగమార్తాండాది బిరుదములఁ బ్రకాశించు నింద్రజాల మహేంద్రజాల మహామహోపాధ్యాయసోదరులవలె బ్రాహ్మణబ్రాహ్మణేతర ప్రతికక్షాదక్షాధ్యక్షుఁడు గాఁడు. వంధ్యాపుత్రుఁడు మృగతృష్ణాజలస్నాతుఁడైనట్లకాలమున బ్రాహ్మణబ్రాహ్మణేతరసమస్యలు జాతీయసభలు స్వకీయకులదంభ ప్రకటనలుఁ గల వార్తాపత్రికలు లేవు. కాన నాయఁడుగారు బ్రహ్మద్వేషము మహాత్ములయం దారోపించి యుపన్యసించుటలోఁ గల నిష్పక్షపాతము చదువరులే యోచింప సమర్థులు. కుకవియుఁ బండితంమన్యుఁడు నగువాఁ డెవ్వఁడైనను గాసటబీసటయను నిందకుఁ బాత్రుఁడు. ప్రతికవియు సుకవిస్తుతి కుకవినింద గ్రంథారంభమున వ్రాయుట ప్రాచీనసంప్రదాయముకాని కేవలశూద్రకవిత్వనిరసనమునకుఁగాదు.

సత్యదయాశౌచ విరహితుఁడు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడు గాఁడనియు స్వధర్మపరిగ్రాహియగు శూద్రుఁడు బ్రాహ్మణునికన్న శ్రేష్ఠుఁడనియు నా భారతమందే సర్వవర్ణాశ్రమాచారక్రమము నిర్ణయించిరికాని బ్రాహ్మణబ్రాహ్మణేతరసమస్యలతో భారతము వ్రాసియుండలేదు. నైతికదూరు లెవ్వరైనను గనిష్ఠమాత్రులని యుద్ఘాటించిరి. బ్రాహ్మణబ్రాహ్మణేతరస్పర్ధలు లేనికాలమున సారస్వతమందుఁ గూడ నిట్టి విభేదము లున్నవని వెతకులాడు పరిశోధనము స్వప్రసంగబలనిర్మాణ సోపానమనుట కావంతయు వింతలేదు. "రంగనాథరామాయణము నింతవఱకుఁ వెలుగులోనికి రాకుండఁ జేసినారు, ద్విపదకావ్యము ముదిలంజ దిడ్డికంతయని నిందించినారు, ఆముక్తమాల్యద శ్రీకృష్ణదేవరాయలు వ్రాయఁగా నల్లసాని పెద్దన వ్రాసినాఁడన్నారు, శ్రీకృష్ణదేవరాయలు బ్రాహ్మణభక్తి కలవాఁడని యచ్చటచ్చట వ్రాతురు, అందఱికి బ్రాహ్మణభక్తి యుండుట యొక సుగుణమని బ్రాహ్మణకవులు ప్రతిపుస్తకములో వ్రాతురు, ఎంతభక్తివిశ్వాసాలు చూపినను బ్రాహ్మణేతరకవులయం దాదరణ చూపరు" అనిరి. రంగనాథరామాయణము బ్రాహ్మణేతరోద్యమ మాచరణలో లేనికాలమున మఱుఁగుపడియుండ నిటీవల బ్రాహ్మణేతరనాయకులు బయలు వెడలిన తర్వాతఁ వెలుగులోనికిఁ దెచ్చినట్లు ధ్వనించినారు. రంగనాథరామాయణమున కానాఁటి కెంతగౌరవము గలదో యిప్పటికి నాగౌరవము తగ్గలేదు. ద్విపదకావ్యమైనను మఱి యేకావ్యమైనను నెవరివ్రాఁతయైనను దానికిఁ గల విఖ్యాతి రచనానైపుణ్యమునుబట్టి యుండునుగాని కక్షలతో సంబంధించియుండునా? మొల్ల యాఁడుదియైనను బ్రాహ్మణేతరయైనను నామె వ్రాసిన రామాయణము నెవరు కాదనిరి? ఇది యసంబద్ధమని యోచింతురుగాక. ద్విపదరచన బహుసులభమగుట చేతనో మఱి యేసందర్భములలోనో ద్విపదకావ్యము ముదిలంజ దిడ్డికంతయనియు

ఆ. వె. అల్లసానివాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు
పాండురంగవిభుని పదగుంభనంబును
కాకుమానురాయ ! నీకె తగుర.

అనియు నల్లసానిపెద్దన యటునిటు నేడ్చె ముక్కుతిమ్మన ముద్దుగ నేడ్చె, భట్టుమూర్తి బావురని యేడ్చె ననియు నమవసనిసియనుప్రయోగమునకు

క. ఎమి దిని సెపితివి కపితము?
క్రమమెఱుంగక యెట్టిపుచ్చకయ దిని సెపితో
వుమెతక్కయ దిని సెపితో
అమవసనిసి యనినమాట యలసనిపెదనా!

అనియుఁ దెన్నేటిరామలింగఁడు తిప్పాఁడాతట్టెఁడంత యనియు వాఁకిటికవి కోటి మాధవా! కిటికోకె యనియుఁ బింగళిసూరన్ననోటఁ బింగే పెడుదుక్, అనియు నిట్లు పెక్కులు వారివారి పరిహాసవశమున బ్రాహ్మణులను బ్రాహ్మణేతరులను బరిహసించుకొనిరి. అద్దాని నొక సిద్ధాంతముగఁ బ్రమాణీకరించి కేవల బ్రాహ్మణేతరనిందయని తలంచుట నాయఁడుగారి పొరపాటులలో నొకటి. ఆముక్తమాల్యదారచనయు మనుచరిత్రరచనయుఁ గొన్నిఘట్టములం దొకదాని నొకటి యనుకరించుచున్నట్లు కనిపెట్టి తదీయాస్థానకవియగు పెద్దన వ్రాయుటగాని సంస్కరించుటగాని జరిగియుండెనని యిప్పటి విమర్శకులు వ్రాసిరికాని యానాఁటి కవిపండితు లెవ్వరైన సూచించిరా? కాని యీవిషయము పూర్వాపరములు కవిశిఖామణులైన నాయఁడుగారు తెలిసియో తెలియకుండియో సెలవిచ్చినారు. మఱియు, కందుకూరి వీరేశలింగము వడ్డాది సుబ్బరాయఁడు వేదము వెంకటశాస్త్రి యనుచుఁ బైవారి పద్యాలవలె బ్రాహ్మణేతరకవుల పద్యాలు లేవనిరి. నాయఁడుగారు ప్రోత్సాహపఱచి తన యౌదార్యమును జూపుటలో నిర్వివాదమే కాని ప్రసంగమున వారియందుఁ జూపవలసిన గౌరవభావము లోపించినటుల ధ్వని గన్పడుచున్నది. ఎట్టి భావమున్నను వారి ప్రతిభావిశేష మాంధ్రదేశమునకు నూతనము గాదు. నాయఁడుగారు పై నుదాహరించిన భక్తివిశ్వాసా లనుమాట స్వవచనవ్యాఘాతమగునేమో ? యని పాఠకు లూహింపవలసివచ్చును. కవిత్వ మనుభవపూర్వకముగాఁ జెప్పవలెనన్న బ్రాహ్మణేతరుఁడే చెప్పవలె! కవిత్వము సాహిత్యము సంఘముయొక్క జీవనము, ప్రజలయొక్క జీవనమే సాహిత్యము, సంఘములో నూటికి 2 వంతులున్న బ్రాహ్మణుఁడా కవిత్వము వ్రాయువాఁడు? నూటికి 90 మందియున్న బ్రాహ్మణేతరులే కవిత్వము వ్రాయవలెను. అల్లసానిపెద్దన కన్నులుమూసికొని కవిత్వము వ్రాసినాఁడు, కృష్ణదేవరాయలు కన్నులుతెఱచి వ్రాసినాఁడు, కాఁబట్టియే యాయనకృతియందు జాతిజీవనము పైకిఁ దీసికొనిరావలసిన బాధ్యత గలదు, కాఁబట్టి బ్రాహ్మణేతరకవులే పైకిఁ దీసికొని రావలెనని యుపన్యసించినారు. సత్కవితారచనకు బ్రాహ్మణ బ్రాహ్మణేతరనిర్ణయములు నధికజనసంఖ్యానిర్ణయములు నేలాకో యని పాఠకులకుఁ

దోఁచుటలోఁ దప్పులేదు. బ్రాహ్మణేతరుఁడే కవిత్వము చెప్పవలెనని సిద్ధాంతము చేయుట చాలఁ జిత్రము. కవిత్వ మొక కళ. దీనినిగూర్చి యనుభవవేత్తలు.

శ్లో. గాంధర్వంచ కవిత్వంచ దయా దాన శమాదయః
అభ్యాసేన నలభ్యంతే చత్వార స్సహజా గుణాః.

అని యనిరి. అనున ట్లది ప్రకృతి నైజశోభగాని కులమతములతో సంపర్కిం కరించునా? గాయకులుఁ గవులు వక్తలు సౌందర్యవంతులు భోగభాగ్యసంపన్నులు నన్ని తెగలలో నుండవచ్చును. మఱికొన్నికళలు వారసత్వపరంపరగా వచ్చును.

కవిత్వగాంధర్వములు దైవదత్తప్రసాదమునఁ దమంతఁ దామె ప్రసన్నత వహింపవలెను...కోయిలగానమున కె ట్లవ్యక్తపరవశానందము గలదో యట్టి స్వేచ్ఛానుభవైకరసము సత్కవిత్వమందుఁ గలదు. ఇందులకుఁ గాదంబర్యాది గ్రంథరచనలు ప్రబలనిదర్శనములు. ప్రాచీన నవీనకవులలో నూటికిఁ గొంచె మెచ్చుతచ్చు 97 గురు బ్రాహ్మణు లుండుటం బట్టి కాఁబోలు జనసంఖ్యలో నధికసంఖ్యాకులే కవిత్వమున కర్హులని రూఢిపఱచిరి. జనసంఖ్య యెంతయుఁ గవులతో నేకాలమందైనను నిండి యుండదు. కాళిదాసాదులు సంస్కృతకాలమందును శ్రీనాథాదులు తెలుఁగుకాలమునను నాకాలపు జనసంఖ్యలో నక్షత్రములవలెఁ బ్రకాశించిరి కాని యందఱికిఁ బ్రాముఖ్యము గలిగినదా?...గాంధీ నెహ్రూలవంటి నాయకు లందఱు నగుదురా? కాన జాతీయజీవనవిధానమునకు సంబంధముగాని కవిత్వమునకు సంఘసంఖ్యాధిక్యమునకు సంబంధము లేదు. కవిత్వమనఁగాఁ బద్యములు వ్రాయుట గాదు. ప్రహ్లాదాదుల భగవద్భక్తిపారవశ్యమువంటి సుఖానుభవము. దీనికిఁ దార్కాణముగ మన ప్రాచీనుల గ్రంథములు నానాఁటికి నవలెత్తి కొనలుసాగి దశదిశలందు వ్యాప్తిం జెందుచున్నవి. కాన మానవులు జనసంఖ్యతోఁ బోట్లాడుటకు సంగ్రామము గావలెను. అట్టితఱి జనసంఖ్య లెక్కచూడవచ్చునుగాన మనవి వ్రాసినాను. మఱియు, అల్లసాని పెద్దన కన్నులమూసికొనియుఁ గృష్ణదేవరాయలవారు కన్నులు తెఱచియుఁ గవిత్వము వ్రాసినారని వ్రాసినారు. ఇది వారివారి గ్రంథరచనబట్టియే నాయఁడుగారు పలికి యుందురు. ఆవిషయములు సహేతుకముగ నాయుఁడుగారు విమర్శించిన శిరసా వహింతునని మఱిమఱి మనవిచేయుచున్నాఁడను.

---

—* రైలుబండ్లలోని మఱుఁగుదొడ్లు *—

అన్నితరగతుల రైలుప్రయాణికుల బండ్లలోను మఱుఁగుదొడ్లుండును. వానిలోనే ప్రక్షాళనముచేసికొనుటకు నీరుండును. మలము వదలుటకు రైలుదిగువ నొక పెద్ద రంధ్రముండును. ప్రయాణికు లారంధ్రమునకు సూటిగా మడ్డి నుంచి మలము వదలవలయును. కాని 3 వ తరగతి ప్రయాణికుల కీసంగతి తెలియదో లేక యేసుఖము కొఱకైయో కాని పెక్కు దొడ్లలో నారంధ్రములోఁ గాక మిగతప్రదేశములమీఁద మలవిసర్జనము చేయుచున్నారు. అందువలన నవి యితరుల కుపయోగించుకొనుట కసహ్యకరముగానుండును. ప్రయాణికుల కింతమాత్రపు తెలివి లేకపోవుట దురదృష్టము. ఈవ్యాసము చదివినవా రెల్లరును దోడివారలకుఁ జదివి వినిపించి వారు క్రమముగాఁ బ్రవర్తించునట్లు బోధింపఁగోరెదము. (ప్రకృతి)

చ. కరయుగ మంఘ్రియుగ్మము మొగం బురముఁ భుజముల్ ధరా
తిరముగ మోపి తత్పరత దేవుని సన్నిధి మేన గగ్గురుల్ స్థలిన్
పరిపరిగాఁగఁ గన్గొనల బాష్పము లూర మదిం దదేకసం
స్మరణము మీఱ మ్రొక్కిన నమస్క్రియ తిర్పతివేంకటేశ్వరా!

చ. త్రికరణశుద్ధి నర్ఘ్యతతి దెచ్చి శిలాప్రతిమాదులందు వే
దకలిత మంత్రయుక్తి భవతాపనివారకమంచు నమ్మి పా
యక భవు షోడశోపచరణాప్రృతిఁ దన్మయతన్ యజింప స
య్యకలుషవృత్తి యర్చయనఁగద తిర్పతివేంకటేశ్వరా! 305

చ. ఒడయుఁడకాఁగ నీశుకళ నొక్కెడఁ జేర్చి మహోపచారముల్
పడగలు వీవనల్ గొడుగు పాదుక లందల మన్యయానముల్
బడిబడిగూర్చుచున్ స్తుతులు వాద్యములాటలు పాటలుం దగన్
పడయు మహంబె సేవయన భాసిలుఁ దిర్పతివేంకటేశ్వరా! 306

ఉ. ఈశుఁ డసంగి తత్కలయె యేనన నట్టిఁడనైనఁ గర్మముల్
పాశపుఁ జుట్టికోలున నిబద్ధుఁడనై పెడదారిఁ బట్టితిన్
దేశికు సత్కృపాప్తి గడిదేఱితి బంధము లూడెనన్న శు
ద్ధాశయ మాత్మవేదనమె యాఁజుమి తిర్పతివేంకటేశ్వరా! 307

ఉ. ఎన్నఁగలేరు నీమహిమ మింద్రముఖామరు లన్న నాకు మా
అన్న! తరంబె నిన్ బొగడ? అచ్యుత! మంగళవిగ్రహా! మహా
పన్నశరణ్య! దేవ! యని భావన తన్మయిగాఁగఁ దద్గుణా
భ్యున్నతిఁ జొక్కఁ గీర్తనమె యొక్కటఁ దిర్పతివేంకటేశ్వరా!

చ. తన సరివారుఁ దాను నొకచక్కిఁ బ్రసన్నతఁ జేరి యాశు మే
ళ్గానములఁగూర్చి పాడుచుఁ బ్రలుప్త పరేతరవృత్తులై ముదం
బున స్వరరాగతాళగతి బుద్ధి రమింప రసానుభూతిఁ జొ
క్కనదియుఁ గీర్తనంబె యనఁగాఁదగుఁ దిర్పతివేంకటేశ్వరా!

చ. అసదగు దృశ్యమెల్లనని యయ్యెడ వేసరి దృక్స్వరూపతన్
పొసఁగు పరాత్మ హృద్గతు విభున్ భువనేశ్వరు సర్వమూర్తిఁ ద
ద్రసుఁడయి కాంచుచున్ సమవధాన మెసంగఁ దదేకవృత్తిమై
మసలుట చింతనంబు బుధమానిత! తిర్పతివేంకటేశ్వరా! 310

చ. శమము దమమ్ము మున్నగుప్రశస్తగుణమ్ములు గల్గి చిత్తవి
భ్రమము దొలంగి యర్థముల పాలికి వృత్తి మలంగనీక నే
మము తనుపారఁ దానె పరమంబగు తేజను బోధరశ్మిఁ బెం
తమ మగలించు నయ్యతఁడె ధన్యుఁడు తిర్పతివేంకటేశ్వరా!
ఉ. క్లేశములెల్ల నెల్లెడ వికీర్ణములై చనఁ గర్మభూవిపా
కాశయముల్ దలంగ మహితాశయుఁడై హతపాశబంధుఁడై
ఈశునిఁ జేరు తా నగు నధీశుఁడు. మానితసర్వశాస్త్రసం
దేశితవృత్త మియ్యది సుధీనుత తిర్పతివేంకటేశ్వరా! 312

## ఆశుకవిత్వము

ఉ. నాగరికత్వ మెచ్చెనఁట. నల్వుర కెక్కి నపిచ్చిగాక యీ
యాగ మదెట్లు మెచ్చనగు? ఆశుకవిత్వమటంచు నూరకే
ఊఁగెడువారె పూజ్యులఁట. ఉత్తమపాత్రపు మెప్పులొప్పె. ఏ
లాగున లాగ దీకలివిలాసము తిర్పతివేంకటేశ్వరా! 313
ఉ. వ్రాసెడువాఁడు లేఁడు. రసభావము లౌననువాఁడు లేఁ డిఁకే
దోసము లెంచఁబోఁ డొకఁడుఁ, దుందుడుకొప్పఁగఁ బాడినంతనే
మీసలు లాగువారలఁట. మేలని పండితులం దెరల్చి యీ
మోస మెఱుంగరైరికద మూఢులు తిర్పతివేంకటేశ్వరా! 314
ఉ. మాటలపద్ధతిం దొడరు మంచిరకంబుగఁ గొన్నిపద్దెముల్
తేటగ వర్ణనాంశములఁ దీరిచియుంచిన కొన్నిపద్దెముల్
పాటగఁ బాడుచుం నడుమఁ బట్టిన యక్కథలోని పేళ్లటో
నాఁటిన నేఁటి కాశుకవినాఁదగెఁ దిర్పతివేంకటేశ్వరా! 315
చ. అడిగెడువాఁడు పండితుఁడొ. యౌననువాఁడు రసజ్ఞుఁడో? కృతుల్
నొడివెడువాఁడు గ్రంథములు నూటికిఁ గోటికిఁ దా రచించెనో?
ఎడ పెడ వాగు వాగు డిది యేటికి మెచ్చెదరయ్య? ఇంతత
ప్పుడుకవనమ్ము గూడ దనఁబోలదె తిర్పతివేంకటేశ్వరా! 316
ఉ. కూడును గూడదంచనెడి గోడె యెఱుంగని సభ్యులైనచో
ఆడినదెల్ల నాటయగు. అట్టులె పాడినదెల్లఁ బాటయౌ.

పాడుకవిత్వ మిట్లు పరిపాటిఁ దలిర్చెడివేళ సత్కవుల్
వ్రీడ జనింప నొక్కయెడ వ్రేలరె తిర్పతివేంకటేశ్వరా ! 317

ఉ. ఆకర మెట్లు లేనియెడ నాశుకవిత్వ మదేల ? ఊళ్ళపే
ళ్ళకుడుపాట పాడుసతఁడే కవినాఁదగు. మున్నుదిట్టు తి
ట్టకళఁ దోఁపనీక యిఁకనెన్నియొ తిట్టెద నేనటన్నఁ బు
ల్లాకులలచ్చి మెచ్చఁ దగవౌఁగద తిర్పతివేంకటేశ్వరా ! 318

ఉ. నోటికివచ్చు శ్లోకములు నూఱులు రెండు పఠించిచూడ నే
ర్పౌ టరగంటకాలముగఁ బట్టెడు దానికి. నేఁటిపద్దెముల్
పాటొకయింతలేక బడ బాడ బడాబడమంచు మీటఁగన్
పాటిలు మేటి కేటిపరిపాటియొ తిర్పతివేంకటేశ్వరా ! 319

ఉ. బుద్ధియు వాక్కుఁ గూడినను బుట్టుఁ గవిత్వము, గాక యిట్లసం
బద్ధపు మాటలాడెదరు పామరు. లా మఱుమాట లాడుచో
బద్ధులు గారె యొక్కయెడ ? పండితులేనియు వేలువంద లీ
బుద్ధులనోట దొర్లుననఁబోలునె తిర్పతివేంకటేశ్వరా ! 320

ఉ. అద్దిర! కాళిదాసముఖులౌ కవివర్యులు లేరె ? గ్రంథముల్
పద్దులుమీఱఁ గూర్పరె ? నృపాలురు సభ్యులు నిచ్చ మెచ్చరే?
మొద్దుకవిత్వ మిప్పగిది మూఢు లహోహోయనఁ బాడరైరిగా
కిద్దశ నేఁటివారి కిడనెంచిరొ తిర్పతివేంకటేశ్వరా ! 321

చ. గడియకు నూఱుపద్దెములుగాఁగఁ బొనర్చిరి, యాశుధారఁ జొ
ప్పడునవి సద్రసప్రచురపద్ధతి నెక్కన నిల్చెఁగాక పే
రడఁగి చనంగ నయ్యనె? మహామహు లప్పటివారొ వీరొ నే
ర్పడరఁ దలంపరాదె హృదయాళులు తిర్పతివేంకటేశ్వరా! 322

ఉ. ఎన్నఁగడంగ నీల్గినవి యెన్నియొ చేరిన వెన్నియో, యెటో
ఎన్నిన నేమి? బొంకిన మతేమిఫలం? బెటు శూన్యమేకదా !
ఉన్నది లెక్క యొక్కటియ యూడినబిడ్డల లెక్కవోలె నేఁ
డెన్నిక గల్గెనే కవిత కీగతిఁ దిర్పతివేంకటేశ్వరా ! 323

చ. ఇటులన నాశుధారయన నెయ్యదియంచు వచింతు రిందులో
తటుకునఁ గొంద. ఱాఘనులు. తత్పరతం గననొప్పు కావ్యముల్

పటురసహావభావములపట్ల నెటుల్ దసలంగనీక యొ
క్కటి నిడుపౌ తటిల్ దివియగానగుఁ దిర్పతివేంకటేశ్వరా !

ఉ. ముండలపెండ్లిసేఁతవలె ముఖ్యులు మెచ్చనిదాట నూరకే
ఉండుటగాక సత్కవుల కోటమిగల్గునె దీన ? చేతగా
కుండియు యిట్లుపల్కుటని యూహఁ బెనంగుదు రొడ్లు. దేనికై
పండితవాక్కపశ్రితికిఁ బాల్పడుఁ దిర్పతివేంకటేశ్వరా ! 325

ఉ. అచ్చపుఁదెల్గు గాంచిరఁట. ఆదట సంస్కృత మబ్బునంట. పై
పెచ్చుగ మిశ్రకావ్యములఁ బేరును బెంపును గాంతురంట. హా !
అచ్చెరువయ్యె. వ్యాకరణ మయ్యెడ నియ్యెడ సున్నయంట. నేఁ
డిచ్చలచిత్తులా కవు ? లిఁకేమగుఁ దిర్పతివేంకటేశ్వరా ! 326

ఉ. పాండితి చెడ్డ నల్ గవిత పట్టెనటంచను. దాన భ్రష్టుఁడై
బెండుపురాణముల్ నొడువఁ బేర్కొను. అయ్యెడఁ జాలకున్నచో
దండి కృషీవలుండనను. దానఁ బరిశ్రమ మూనలేనిచో
నిండెను భక్తి దాసుఁడను నేననుఁ దిర్పతివేంకటేశ్వరా ! 327

ఉ. నమ్మినవారలున్నఁ గవనమ్మని పాడుటె కాక మంచిగ్రం
థమ్ము రచింపఁగం దెలియదా సరసత్వము? భట్టులట్టు లా
క్కమ్మడిఁ గూర్చియుంచెదరొకో యనువారికి నుత్తరమ్ము దా
నెమ్మెయినిచ్చు ? సమ్మతిలు నెవ్వఁడు తిర్పతివేంకటేశ్వరా !

## —♦ కవిత్వము ♦—

చ. కలరు మహానుభావు లిలఁ గైతలఁగూర్చెడిపట్ల, నొక్కనిన్
తలఁచి మఱొక్కనిం దలపఁగాఁ జన. దిప్పటికేని సద్ది యు
ట్టుల యనఁబోలు. ఐనఁ దకటొంకులు కొందఱు కావ్యపాకవృ
త్తుల వికలత్వమందుటయుఁ దోఁచెడిఁ దిర్పతివేంకటేశ్వరా !

చ. మును కవు లెల్లశాస్త్రముల ముచ్చటలం దనివోక కాంచి పె
క్కు నియతు లొప్పఁ గావ్యములఁ గూర్చిరి. నేఁ డిరుమూఁడుపొత్త
కని నడివారు వారివలె ఖ్యాతివహించెదమన్న నేతొడుల్ [ముల్
కనుపడకున్నె ? పండితులు కాంతురె తిర్పతివేంకటేశ్వరా ! 330

కం. గురిజాలకు మీర్ వచ్చిన
తరువాతఁగదె పలనాడుతాలూకా దు
శ్చరితుల మదము లడంగుట
సరవిం దగు దండనములు సల్పుటవలనన్. 19

ఉ. తక్కటియూళ్ళ సంగతులు తథ్యము సెప్పఁగఁజాలఁగాని బల్
నిక్కుచుఁ బెద్దపిన్న గననేరక మత్తిలి జానపాడునం
దెక్కుడుమందియుండ నొకరిద్దరి క్రొవ్వు లడంగియుండుటల్
నిక్కముగా నెఱుంగుదును నేఁ బులివర్తికులాబ్ధిచంద్రమా! 20

శా. ఆ యానందసమాజమందు విధిమై నాస్థం బ్రవేశించునాఁ
డే యారంభముగాఁగ నేగి రహి మీ రేప్రొద్దునన్ బత్తిమై
ఆ యీశుం గొనియాడు చొక్కపరిహారం బానందముంబొందరో
క్కో యానందసమాజసంజ్ఞ యగుఁబో యోగ్యంబనన్ భూజనుల్.

ఉ. శాస్త్రులటంచు వాడఁబడు భూసురవర్యులు చూడఁబడ్డచో
శాస్త్రులవారు రండనుచుఁ జాల నయంబునఁ గొంచుఁబోయి త
చ్ఛాత్రముఖాబ్జనిర్గళిత శాస్త్రవచస్సుధ గ్రోలి యాపయిన్
వస్త్రముఖప్రదానముల వారల మీరలు తన్పుచుండరే? 22

చ. ఇహమునఁ బాపమున్ సలుపు నెంతటివానినినైనఁ బట్టి మీ
రహమిక నోవఁ గొట్టి మఱి యంఘ్రుల సంకెళు లంటఁగట్టి బ
హ్వాహములు శిక్షవేయుటయె యయ్యెడి సాక్షి పరంబునందునున్
దహనునిపాలుసేయుదురు తప్పక పాపమునన్న దానికిన్. 23

ఉ. బీదలమీఁద మీకుఁగల ప్రేముడిపెల్లున వారిఁ దన్పఁగన్
సాధనమెద్దియంచు మదిఁ జాల విచారముచేసి చేసినా
రేదియొ పేరుఁబెట్టి మహ మివ్విధి. అవ్విధిఁ గాకయున్నచో
బీదల కేల యన్నమును బెట్టుదు రేనుదినంబు లచ్చటన్ ! 24

తే. గీ. కూరగాయల కీప్రక్కఁ బేరుఁబొంది
ఉన్న దాచేపలింగూడ మున్న మీరు
ఘనత గురిజాల సల్పినకార్యమునకు
తఱుగువడకుండ నయ్యవి దొరకవఁటగ ! 25

తే. గీ. బండ్లతోడను గొనిపోవు ప్రజలకేని
కూరగాయలు దొరకు నాయూరఁ జూడ,
ఎన్ని బండ్లకు నింపిరో యేమొ కాని
దొరకలేదని విన్నంతఁ దొడరె వింత. 26

ఉ. కాయలుఁ గూరలుం దలుగు కానియటుల్ పరిశీలకుండవై
పాయసమాదిగాఁ గలుగు పంచవిధాన్నము వండఁజేసి యే
సాయము లేక యొక్కఁడవె సత్రము బాగుగ సాగఁజేయ నీ
కే యటఁ జెల్లెఁగాని యిఁక నెవ్వరు రాఘవరాయ! తాదృశుల్?

ఉ. ఎప్పటి కొక్క పండితుని నింట వసింపఁగఁజేసి వారిచే
జెప్పఁగఁబడ్డ గాథలను జేతులు మోడ్చి కరంబు భక్తిమై
దప్పక వించు నన్నమిడి ధాత్రిసురేంద్రులఁ దన్పు మిమ్ములన్
జెప్పియె చెప్పనౌ నొరుల శ్రీకర రాఘవరాట్సుధీమణీ! 28

మ. రహిం దాచేపలిలోన మీర లతుల ప్రజ్ఞావిశేషంబులన్
తహసీల్దార్పని చేయుచుండి మిగులన్ ? ధర్మాధ్వసంచారులై
బహువారంబులు నన్నదానములచే బ్రహ్మణ్యులం దన్పరే?
అహహా! రాఘవరావుపంతులు! జగత్ఖ్యాతంబు మీనామమహా. 29

కం. ఇలి నానందసమాజం
బిల సన్వర్థంబుఁజేయ నీరలకే కా
కలఁతిజనంబుల కగునో కో
చలపతిరాయాభిధాన సజ్జనవర్యా! 30

కం. తొలిపలుకు లెపుడు చదివితొ
ఎలమి బియేక్లాస్పరీక్ష యొప్పు డయితో కా
తెలియక యబ్బురపడెదన్
చలపతిరాయాభిధాన సరసవరేణ్యా! 31

అని ప్రత్యుత్తరము వ్రాసితిని. అది చూచినదిమొద లవ్వార లస్మత్సహవాసము నభిలషించుచుండిరి. గురిజాల కరుగుటతోడనే యగ్రాగారవము స్వీకరించి యష్టావధానము చేయించిరి. అల్లు లనేకు లారంభించి యవధానముల విలువ త్గ్గించిరి. కాని శతావధానమునకే కాక యష్టావధానమునకుఁగూడ నప్పు డత్యంత గౌరవ ముండెడిది. ఆయవధానముల రీతియే వేఱు. అవధాను లాంధ్రమందే కొ

సంస్కృతమందుఁగూడఁ జాల ప్రజ్ఞ గలిగి యుండెడివాఁడు. ధారణాశుకవిత్వములు గారాళముగాఁ గలిగియుండెడివి. ఇన్ని ప్రజ్ఞ లుండవలయును గనుకనే యెవరికో యొకరికిఁ దప్ప నందఱకును నవధానులగుట కలవి యయ్యెడిది కాదు. ఇందువలన ప్రాంతమున నే నొక్కఁడనే యష్టావధానిప్రసిద్ధి నందియుంటిని. అష్టావధానమే కాదు. శతావధానముగూడఁ జేయుచుంటిని. కాని శతావధానిననిమాత్రము చెప్పికొనుటకు సాహసింపను. శతమునకు సరిగాఁ బాదపూరణముఁ బ్రత్యేకించి చెప్పి యంత్యమున నన్ని పద్యములుఁ జదివినప్పుడే శతావధాని గాని యంతపర్యంతము కానని యస్మదభిప్రాయము. ఆయభిప్రాయముతోనే పంచవింశతిఘంటాకవిత్వమనియుఁ ద్రింశద్ఘంటాకవిత్వమనియుఁ జెప్పుచు, అష్టావధానముమాత్రము నవలీలగాఁ జేయుచు వచ్చితిని. అట్లు చేయుచుండుటచే నన్ను లాపేర వాడుచు వచ్చిరి కాని యేనుమాత్రము మెందును వ్రాసికొనెడివాఁడను గాను. అభినవసరస్వతి యారంభదశయందైనను నగ్రపత్రమం దష్టావధానియని ముద్రాపకులగు దాసు కేశవరావు గారు తగిలించిరి కాని స్వలిఖితము కాదు. అష్టావధాన మప్పటి కట్టిగౌరవముతో నుండుటం జేసియే యాఫీసరు లది చేయ నభిలషించిరి. ఏను జేసితిని. అంతియే కాని కాశిరాజు గోపాలకృష్ణయ్యగారు కరవశపడినట్లుమాత్రము కాదు. అంత గోపాలకృష్ణయ్యగా రవలిపక్షమున నాత్మబంధువుల శిక్షింపఁజేయు యత్నమణుమాత్రము లేకపోయినను నధికారి యానేర మవ్వారు చేసియే యుండిరని యభిప్రాయపడుటచే వకీళ్ళఁబెట్టి వాదింపించియుఁ బ్రత్యక్షముగఁ గాకున్నను నాయాయి మిత్రుల ద్వారమున నాత్మాధిక్య మాయనకు నివేదించియు స్వవచశ్చాతురి సర్వత్ర యుపయోగించియుఁ గేసు కొట్టివేయించెను. కొట్టివేసిన పదంపడి కోపము పట్టలేక యస్మదగ్రజుఁగూడ నవమానితుఁ జేసితీరుదునని యక్కడక్కడ నభివ్యక్తము చేయుటయే కాక యన్నను నన్నును నాక్షేపించుచు దూషింప దొరకొనియెను. బందీకృతులగుపర్యంతము బంధుగులనే నిందించుచుఁ బరమమిత్రుఁడుగా నున్న గోపాలకృష్ణయ్య పరమశత్రువుగా మారిపోయెను. అంతపర్యంతము నాయనకును నాకును గల యత్యంతమైత్రి బాపట్ల డిస్ట్రిక్టుమునసఫుకోర్టు ప్లీడరులును భాగ్యవంతులును నగు బ్రహ్మాండము బాపయ్యగారిపేర నేను వ్రాసిన

—♦ బ్రహ్మాండము బాపయ్యగారికి వ్రాసినయుత్తరము ♦—

ఆ. అక్య! రాజకీయకార్యమొండుండంగ రెండువత్సరములక్రింద నన్ను
గూడి కాశిరాజు గోపాలకృష్ణయ్య యేగుదెంచె మీదులోగిటికిని.

క. తహశీలుదారు నాఁడే
రహిఁ జీరాలను వసింప రయమున మే మా
అహమున నచ్చటికిం జని
గ్రహపత్యస్తమయవేళఁ గ్రమ్మఱ రామే? 2

క. అరుదెంచి మఱుదినంబున
కరుణామతి మీరు మమ్ము గట్టిగ నిలుపన్
పరమానందంబున సం
భరితంబగు మదిని నుంటి మాదిన మెల్లన్. 3

సీ. ప్రొద్దుపొద్దున మీరు పురికిఁ బచ్చినదిశ
మీ పొలా లన్నియుఁ జూపరొకొ ?
గోపాలకృష్ణయ్య గొప్ప దావా యొండు
గెలియుట వ్రాయఁడే యల వకీలు ?
మీరు మేమును గూడి పేరిమి సాయాహ్న
మొగి పికా ర్పోలేదె యూరుఁజూడ ?
డిస్ట్రిక్టుమునసపు ఠీవిమైఁ గూర్చుండి
పిలువలేదొకొ. మ్రోల కెలమి మనల ?
పిలిచి నన్ జూపి యెవరన్నఁ బ్రీతితోడ
అనరె యష్టావధానియం చనఘ! మీరు ?
దయను జేయింత మష్టావధాన మిచట
నని వచింపరె వార లయ్యవసరమున ? 4

క. అది విని నను మీ రడుగఁగ
అద నిది కా దేగవలయు నని నే ననసే
వదలం జాలక స్నేహా
స్పదుఁడౌ గోపాలకృష్ణ సచివశ్రేష్ఠున్ ? 5

క. తదుపరి మీతో నననే
సదమలహృదయా! త్వదీయసన్నిధి కెపుడో
వదలక చనుదెంచెద న
ప్పొదవెడి, అష్టావధాన మొనరుచు టనుచున్ ? 6

క. ఏకా గోపయ నాచే శ్రీకరమగు గ్రంథ మొకటి చేయించెను, తా
నే కృతి పొందెనటంచును మీ కేఁ జెప్పంగలేదె ? మీర్వినలేదే ?

క. పలువ్యాపారంబులలో మెలఁగెడి మీబోంట్ల కిట్టి మిక్కిలివార్తల్
లలిజ్ఞాపకముండవటం చెలమిని వ్రాసితిని దోస మొచకుఁడాత్మన్.

అను లేఖ వ్యక్తముచేసెడిని. అట్టిస్నేహితుఁ డట్లగుట కొత్మను రోసి,

# స హా యు లు

౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి
౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల
౪ వేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట
౫ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురము
౬ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల; అయ్యవార్లంగారు కొత్తాపుర.
౭ రాయచూరి బండేరావుగారు, అయినాపురము.
౮ పేరులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౯ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.
౧౦ చిక్కరాజా మట్టపల్లిరావుగారు - చెరుకుర్తి.
౧౧ గూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు - పటిమాలపల్లి.
౧౨ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు
శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు ఏజంటు
౧౩ రామరాజభూషణ భాషానిలయము - పెంట్లవెల్లి.
౧౪ వలిపె వెంకటరావుగారు, వకీలు - కొల్లాపురము.
౧౫ గండికోట అనంతరామారావుగారు, తహసీల్దారు, నిర్మల.
౧౬ అద్దంకి ... తిరువేంగడతాతదేశికాచార్యులయ్యవార్లంగారు, తక్కెళ్ళ
౧౭ సుంకర నరసింహముగారు, నందిగామ.
౧౮ గరికపాటి లక్ష్మీనరసింహభాస్కరశంకరశాస్త్రిగారు, అంగారుపేట.
౧౯ మియ్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.
౨౦ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.
౨౧ కొత్వాలి కమలాకరరావుగారు, నల్లపల్లి.
౨౨ తిరికాల వెంకటేశ్వరరావుదేశముఖుగారు, పులిగెళ్ళ
౨౩ కొల్లూర్ల నరసింహారావుగారు, జనగాం
౨౪ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.
౨౫ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.
౨౬ రామకృష్ణారెడ్డిగారు, చైవముదిన్నె.
౨౭ వద్దిరాజు సత్యనారాయణ దేశపాండ్యాగారు, మేడిపల్లి.
౨౮ సోమరాజు పరాంకుశరావు దేశపాండ్యాగారు, మేడిపల్లి.
౨౯ సిరిసెనగండ్ల నరసింహారావుగారు, కరణం, తుంగతుర్తి.

# అభినవ సరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 2 | నీతిగీతులు (సుమతిశతకము, దానికి శ్లోకములు) | ... | 0 | 2 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కరిణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] | ... | 0 | 4 | 0 |
| 5 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 6 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 7 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 8 | 0 |
| 8 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము | ... | 0 | 4 | 0 |
| 9 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 10 | వైశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 11 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 12 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 13 | శంతనురాజచరిత్ర (ప్రాచీనప్రబంధము) | ... | 0 | 14 | 0 |
| 14 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 15 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 16 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 17 | సూతసంహిత (ఆంధ్రము) | ... | 2 | 0 | 0 |
| 18 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 19 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 20 | అస్పృశ్యతానివారణఖండనము (మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 21 | భారతకథాతత్త్వనిర్ణయము | ... | 0 | 4 | 0 |
| 22 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 23 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 24 | డిటో నాగరఖండము (3 సంపుటము) | | 1 | 8 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౪ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | పల్నాటివీరచరిత్ర | | 0 | 12 | 0 |
| 27 | ఆరోగ్యభాస్కరము | | 0 | 6 | 0 |
| 28 | భాగవతరహస్యములు | | 0 | 4 | 0 |
| 29 | సోమేశ్వరశతకము | | 0 | 2 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరు జిల్లా.

లకు ధర్మశాస్త్రజ్ఞానము సంపూర్ణముగా న[illegible] అటులనే ధర్మశాస్త్రజ్ఞులగు విద్వాంసుల సాహాయ్యము వారలకుఁ బూర్ణముగా దొరకుచుండెడిది. ఇతరములగు రాష్ట్రహితకరకార్యముల భారము తలచుగాఁ బ్రజలపై నుండెడిది. ఇట్టిశాసన ప్రణాళిక యాసమయమున నడవడిలో నుండెడిది. ఆసమయమందుండు సకలవర్ణములలోని విద్వాంసులకును ధర్మశాస్త్రవిహిత స్వస్వకర్తవ్యములను నిర్ణయించుకొనుటకు ననుష్ఠించుటకుఁ బూర్ణమైన యధికారముండెడిది. దీని కంతటికి నాసమయమందలి సామాజికవ్యవస్థ సర్వోత్తమమై యుండుటయే హేతువు. సామాన్యుల మాట చెప్పనేల ? చక్రవర్తిగూడ ధార్మికవిషయములందు స్వేచ్ఛానుసారము శాసనముల రచించుట కధికారము లేనివాఁడై యుండెను. స్వేచ్ఛానుసారముగ శాసనముల రచించుట రాగద్వేషయుతులగు నెట్టివిద్వాంసులకును న్యాయ్యము కాదు. మనుయాజ్ఞవల్క్యప్రభృతి మహర్షుల స్మృతులు ప్రత్యేకము ధర్మనిర్ణయ విషయమై సమర్థములై యున్నవి. ఈమహర్షులు రాగద్వేషరహితులు, త్రికాలజ్ఞులు. ధర్మాధర్మములఁ బ్రత్యక్షముగ గుఱుతెఱింగినవారలు. అట్లు సమాజశాస్త్రమును గూడఁ బూర్ణముగ గుఱుతెఱింగినవారు. వేదములయందలి నీతిని నభిప్రాయమును గుఱుతెఱుంగుటయందు మహాసమర్థులు. అట్టిసమయపు శాస్త్రీయవ్యవహారమును గమనించియే మహాకవి కాళిదాసు రాజును-

శ్లో. ప్రజానాం వినయాధానాత్ రక్షణా ద్భరణాదపి
స పితా, పితర స్తాసాం కేవలం జన్మహేతవః.

అని వర్ణించెను. ప్రాచీనకాలపు రాజును బ్రజలు భరణమందును బోషణమందును వినయసంపాదనమందును దండ్రిగాఁదలఁచెడివారు. రాజు ప్రజలఁ దన సంతానముగఁ దలఁచెడివాఁడు. ఇరువురకుఁ బరస్పరవిశ్వాసము దృఢమై యుండెడిది. ఇట్టిస్థితిలో రాజ్యవ్యవస్థ బాగుగా నుండెడిదా లేదా యని విచారించు నవసరము ప్రజల కుండెడిదికాదు.

వర్తమానపరిస్థితి.

3. వర్తమానపరిస్థితి యట్లులేదు. ఈసమయమం దీదేశపుఁ జక్రవర్తి ప్రజాసంబంధమునకు దూరస్థుఁడై యున్నాఁడు. ఆయనకుఁ బ్రజలయం దనురాగము ప్రశంసనీయమై యుండినను నధికారము సజాతీయులగు నింగ్లండులోని యాంగ్లేయ ప్రజలచే నియంత్రితమై యున్నది. ప్రత్యక్షముగ నాంగ్లేయప్రజలు భారతవర్షీయులపై నధికారుల ద్వారమున శాసనములు చేసి పాలించుచున్నారు, శాసనకర్తల శాసన ప్రణాళికను వీక్షించినచో రాజ్యపరిపాలనము రాజధర్మానుసారముగాఁ జేయుచున్నట్లు విశ్వాసము కలుగుటలేదు. వారి వ్యవహారము చూడఁగాఁ దాము విజేతలమనియు భారతీయప్రజలు విజితులనియు దృఢముగా భావించినట్లు తెలియఁబడును. వీరిశాసనములవలన నసంతుష్టులయిన ప్రజలు తాము తెలుపుకొనుట కావశ్యకములయిన విషయములను జక్రవర్తికి సముఖమందుఁ దెలియఁజేయుట కసమర్థులై యున్నారు. దీనికిఁ గారణము ప్రజలకుఁ జక్రవర్తికిఁ బ్రత్యక్షసంబంధము లేక

పోవుటయే యైయున్నది. తీయులలో బహుజనుల కాంగ్లేయులు తమ్ము విజేతలుగను వీరిని విజితులుగను నెంచి పరిపాలించుచున్నారను సంగతి తెలియదు. రాజనీతి బాగుగా నెఱింగిన విద్వాంసులకు మాత్రము చక్కఁగాఁ దెలియును. నీతినిపుణులగు శాసనకర్తలీరహస్యమును దాఁచిపెట్టుటకై సంపూర్ణప్రయత్నమును జేయుచుందురు. అయినను జిరకాలము వారితో సహవాసముచేయు బుద్ధిమంతులకు సువ్యక్తములైనవి.

పరిపాలకుల రాజనీతి.

4. మన చట్టములుచేయువారు విద్వాంసులును బుద్ధిమంతులును బలవంతులును నీతినిపుణులును శాసనశాస్త్రరహస్యజ్ఞులును నైయున్నారు. వీరు ప్రాచీనులగు ధర్మనిష్ఠక్షత్రియప్రభువులతోపాటు భారతీయప్రజలకుఁ గల్యాణము కలుగఁజేయుటయే తమ ముఖ్యధ్యేయముగాఁ దలఁచి యీగుణసామగ్రి నుపయోగపఱచినచోఁ జెప్పవలసిన దేముండెడిది? కాని వారట్లుచేయుటలేదు. ప్రజలను సంతుష్టులను జేయుటతోనే తమ రాజ్యము చిరస్థాయిగాఁ జేయఁదలఁచియున్నారు. వారి ధ్యేయము ప్రజలకు మేలుకలుగవలెననునది కాదు. వారల సంతుష్టులఁగా నుంచుటయే స్వరాజ్యచిరావస్థితిసాధనముగా భావించుచున్నారు. స్వార్థప్రధాన పాశ్చాత్యసంస్కృతివలన మన మిట్టి యుత్తమఫలము నపేక్షించుటయుఁ దగినపని కాదు. కనుక నాంగ్లేయులు సాధారణమనుష్యస్వభావముతోఁ జేసిన శాసనపద్ధతియందు దోషముల నెంచుట మనకుఁ దగదు. ఇదియునుంగాక యాంగ్లేయులు భారతీయసంస్కృతికంటె నాంగ్లేయసంస్కృతియే శ్రేష్ఠమని యెంచి తమ్మనుకరించునట్లు చేయుటయే భారతీయులకు హితకరమని తలంచెదరు. ఈ హేతువుచేతనే వారీదేశమందుఁ బాశ్చాత్యశిక్షణము ప్రసరింపఁజేయుచున్నారు. ఈశిక్షాద్వారమున భారతీయులకు శాసనములుచేయు నధికారము కావలెనని బుద్ధిపుట్టినప్పుడాయాసమయములయందుత్తరదాయిత్వశూన్యములగు నధికారముల నిచ్చుచుందురు. దానంజేసి ప్రజలకుఁ దమయందు విశ్వాసము హెచ్చునని వారల తలంపు.

మన ధర్మసంరక్షణ మనయం దేమియున్నది?

5. ఈష్టిండియాకంపెనీవారివలననుండి తాను రాజ్యమును స్వీకరించునప్పుడు శ్రీవిక్టోరియామహారాజ్ఞి భారతీయధర్మములపై మనము హస్తక్షేపము చేసినయెడలఁ దత్ప్రజలు క్షోభింతురని యెంచి మేముకాని మాయధికారులుకాని మీధర్మముపై హస్తక్షేపము చేయమని వాగ్దానము చేసినది. నేఁటివఱకుఁ గొలఁదిగనో గొప్పగనో యీయాజ్ఞ పరిపాలింపఁబడుచు వచ్చినది. కాని యిటుపై నూతనశాసనవిధానమందు హిందువులసంఖ్య భారతవర్షమం దధికము గనుక ధర్మమును వారే రక్షించుకొనఁగలరని యుపేక్షించిరి. ఈనూతనశాసనవిధానమందు ధర్మరక్షణ ముండితీఱవలెనని యెందఱో సనాతనధర్మపరులు పట్టుపట్టిరి కాని వారి ప్రయత్నమంతయు విఫలమయ్యెను. తురుష్కులు సిక్కులు మొదలుగాఁగలవారల ధర్మరక్షణము నూతనశాసనవిధానమందుఁ జేయఁబడినది,

హిందువు లధికసంఖ్యాకులగుట వారు అల్పసంఖ్యాకులగు నితరుల ధర్మముల నాక్రమణచేసినయెడల దుర్బలస్య బలం రాజా యను న్యాయమున సర్కారువారు వారి రక్షింపవలెననియు నధికసంఖ్యాకులగు హిందువుల ధర్మము నితరసంఘములవా రాక్రమింపనే లేరనియు వారి తలంపు. కాని సర్కారువారు హిందూధర్మ మెవరిధర్మము నాక్రమించుటయు యోగ్యమని తలంపరు. ఒకరిధర్మముల నిరోధించుట యయోగ్యమని తలంచుచు హిందువు లన్యధర్మావలంబులం దమలోం గలిపికొనుట కొప్పుకొనరను సంగతిని దొరతనమువారు గమనింపకుండిరి. అట్లు గమనింపలేదు. విచారింపంగా నన్యధర్మీయుల సంఖ్య స్వల్పము. ఐనను వారిధర్మము హిందువుల ధర్మము నాక్రమించును. వారు హిందూధర్మమును దమంతటం దా మాక్రమించుచున్నారు. దీనింబట్టి హిందూధర్మమే యితరసంఘమునుండి రక్షణ మపేక్షించుచున్నది. సర్కారువారీసంగతి తెలిసికొనుటయు నావశ్యకము. ఒకొకప్పుడు హిందువులుగా భావింపంబడువారే హిందూధర్మములపై నాక్రమణ చేయుచున్నారు. వారు నామమాత్రముచేతనే హిందువులు. అపరిచితహిందూధర్మరహస్యులు. అజ్ఞానకులు. అన్యధర్మముల ననుకరించుటచేతనే తమకు సుఖమని భావించెడివారు. అగుంగాక. ఎటులైననేమి! ఇప్పుడిట్టిపరిస్థితి యేర్పడినది. సర్కారువారు మనధర్మమును రక్షింపంజాలరు. భారతీయులకు నందును వర్ణాశ్రమధర్మానుయాయులకు స్వధర్మసంరక్షణ స్వపరాక్రమమువలననే చేసికొనవలసివచ్చినది.

## శాసనము లెట్లు చేయంబడును?

6. భారతీయుల వర్తమానపరిస్థితి విచారింపవలసియున్నది. ఇప్పటిశాసనము లన్నియు నసెంబ్లీసభలద్వారమునం జేయంబడుచుండును. ఆసభలలో రాగద్వేషరహితులై యోగసిద్ధులైన మహర్షులు కూర్చుండరు. అనేకజాతులవారు- ఆస్తికులును నాస్తికులును విద్వాంసులును నవిద్వాంసులును ధార్మికులును నధార్మికులును సర్వవిధ మనుష్యులును సంమిళితులై యుండెదరు. వారిచేం జేయంబడు శాసనములు వేదశాస్త్రాధారములు కావు. ఇంతియే కాదు. వాస్తవికమగు యుక్తివాదమునకును సంబంధించియుండవు. ఆసభలలో నధికసంఖ్యాకు లొప్పుకొనినది శాసన మైతీఱును. అభిప్రాయప్రదాతల యోగ్యతగాని యాచరణముగాని యితిహాసముగాని యెట్టిదను సంగతి ధ్యానమునం దుంచంబడదు. ఇందువలన భారతవాసులు సావధానులై యుండవలెను. ఔదాసీన్యమును వదలిపెట్టవలెను. విచారవంతులును నాచారవంతులును ధర్మరతులును నగు సత్పురుషులను విశ్వప్రయత్నములు చేసియైనను నధికసంఖ్యాకుల నసెంబ్లీసభకు మెంబరులుగాం బంపవలెను. ఇపుడు ప్రమాదముం జెందితిమేని మనధర్మమును మనమే ధ్వంసముచేసికొన్నవార మగుదుము.

## పాశ్చాత్యశిక్షణముయొక్క పరిణామము.

7. మన రాజ్యకర్తల రాజనీతి సఫలమగుటకును గీర్తిశాలిని యగుటకును మన యజ్ఞానము నదూరదర్శిత్వమునం గారణములైయున్నవి. మనకు మొదటినుండియు నుండియున్న ధర్మభావన స్థాయియై యున్నచో విపరీతభావనల నారంభమందే

తుంచివేయుటకు యత్నించుచో మన రాజ్యకర్తలు మనధర్మముపైనను మన సమాజవ్యవస్థలపైనను జేసిన హస్తక్షేపములు సఫలములు కాకుండెడివి. ఒకవేళ రాజ్యకర్తలు బలాత్కారముగాఁ బ్రజలకు విరుద్ధముగా హస్తక్షేపము చేసినయెడలఁ బ్రజలకుఁ బ్రభువులకుఁ బ్రబలవిరోధము కలిగియుండెడిది. ఇపుడు జరిగెడి యాక్రిమణ మంతయు మన యౌదాసీన్యపు ఫలమే. పాశ్చాత్యశిక్షణముఁ బాశ్చాత్యుల సహవాసము మన ధర్మబంధువులలో నొకవిధమైన సంఘమును బుట్టించినది. అట్టి సంఘము ధర్మమును దుచ్ఛముగా భావించును. రాష్ట్రోన్నత్యమునకును సమాజౌన్నత్యమునకును ధర్మము ప్రతిబంధముగాఁ దలంచును. ఈసంఘము సాహసముతో ధర్మమూలకమైన సంస్కృతి నశించినఁగాని మనకు మేలుగలుగదని చెప్పును. విచారించిన నిట్టివర్గము స్వల్పసంఖ్యాకము. ఐనను జపలము నుత్సాహవంతము వ్యయశీలము నైయున్నది. ఈవర్గపుఁ బ్రమాదమును బళిబళియని శ్లాఘించుచు విలాసవంతులగు ధనికులలోని యువకు లీవర్గమున కార్థికసాహాయ్యము చేయుచున్నారు. మన మిఁక సావధానచిత్తులమై యుండవలయును. అట్లుగానిచో నీవర్గమువా రసెంబ్లీ మెంబరులైనపుడు ధర్మము సంస్కారము మొదలైనవాని వినాశనమున కధికముగ యత్నింతురు. అపుడు ధర్మము సర్వధ్వంసమై పోవును. మనము రాజ్యకర్తలు మేలు చేయుదురని యాశపెట్టుకొని యుండఁగూడదు. వారు ధర్మసంబంధమం దుదాసీనులవలె నటించెదరు. మన భారతీయులలోనే పరస్పరవిరోధము కలిగియుండుటం బట్టి రాజ్యకర్తలతోఁ బ్రతిఘటించుటకు వీలే యుండదు. పరస్పరవిరోధమువలన మన ధర్మమే నశించును. దానితోపాటు రాష్ట్రియోన్నతియొక్కయు సమాజోన్నతియొక్కయు నాశ నిర్మూలమగును.

## వివిధ రాజకీయ పక్షములు.

8. వర్ణాశ్రమవ్యవస్థాపరిధానమగు సనాతనవైదికధర్మముయొక్క యుజ్జ్వలస్వరూపము ప్రాణిమాత్రమునకు సుఖకరమనియు హిందూసంస్కృతియు సమాజరచనయు సర్వోత్తమమనియుఁ బాశ్చాత్యపండితుల నొప్పించి వారి ద్వారమున నవనాగరకులఁగూడ సనాతనధర్మము సమాజోన్నతికి బాధకము కాదనియు సాధకమనియుఁ బ్రచారముచేసి యొప్పింపవచ్చును. కాని స్వల్పకాలములో నీపని సాధ్యము కానేరదు. వర్ణాశ్రమధర్మవిరోధులయొక్కయు నుదాసీనులయొక్కయు నుద్యోగముయొక్క భూమికను సంపూర్ణముగాఁ దెలిసికొని వా రసెంబ్లీ మెంబరులైనచో మనకుఁ జెఱుపుగలుగువిషయముల నూహింపవలెను. శాసనసభల యెన్నికవిషయమై నూతనముగా నేర్పఱచిన చట్టము ప్రకారము తురకలకుఁ గాని యూరోపీయులకుఁ గాని యస్పృశ్యవర్గమునకుఁ గాని మెంబరులై యుండుటకు వోట్లనిచ్చెడి యధికారము మన వర్గమునకు లేదు. వ్యాపారులు మొదలగు నితరుల కిచ్చుటకుఁ గలదు. చిన్నచిన్నవర్గములకుఁ దప్ప గొప్పసంఘములలోనివారికే మనవోట్లీయనై యున్నవి. కనుక మహాసంఘములోనే యున్న యవాంతరసంఘముల యుద్దేశములఁ గుర్తించి తెలిసికొనుట మన కర్తవ్యతావశ్యకము, అట్టి యవాంతరసంఘములు

కాంగ్రెస్సు సమాజసత్తావాది సామ్యవాది హిందూమహాసభ యుదారమతవాది ప్రతిసహకారవాది మహారాష్ట్రములోని బ్రాహ్మణేతరపక్షము మదరాసు ప్రెసిడెన్సీలోని జెస్టిసుపక్షము నైయున్నవి.

## మనతో నిష్కారణద్వేషము.

9. మనము నిష్పక్షపాతబుద్ధితో నీపక్షముల యుద్దేశముపై విచారముచేయవలసియున్నది. వీరిలో ననేకమతములవారు కారణములేకయే సనాతనధర్మపరులను ద్వేషింతురు. వారికి సనాతనధర్మవ్యాపకసిద్ధాంతములు తెలియవు. రాజకీయవిషయములలోఁ గూడ నాయా సమయములలో నార్యసామాజికులును సనాతనధర్మపరులపై విరోధించుచున్నారు. ఇంతియే కాదు. వారు కాంగ్రెసుపక్షములోఁ జేరుచున్నారు. మఱియు సనాతనధర్మపరు లస్పృశ్యులను ద్వేషింతురని చెప్పుచు వారి కప్రతిష్ఠ యాపాదించుచున్నారు. శుద్ధబుద్ధితోఁ జూచిన సనాతనధర్మపరుల కెవ్వరియందును ద్వేషములేదని తెలియవచ్చును. వాసుదేవ స్సర్వమను శాస్త్రప్రకారము సమస్తపదార్థములును వాసుదేవస్వరూపమని సనాతనుల సిద్ధాంతము. వారు శాస్త్రాధారముతోనే ప్రతివిషయమును నిర్ణయము చేయుదురు. వర్ణాశ్రమధర్మమే కల్యాణకరమని శాస్త్రకారుల సిద్ధాంతము. యథార్థదృష్టిచేఁ బశుపక్షిమృగాదులును బరమాత్మస్వరూపమే. ఐనను వ్యవహారకాలమందు వ్యవహార ప్రదర్శకశాస్త్రానుసారముగా నాయా పదార్థములతో వ్యవహారము చేయఁబడును. ఒకశరీరమందలి సర్వాంగములును సమానరూపముచేఁ బవిత్రములని కాని యపవిత్రములని కాని యెంచఁబడవు. సనాతనుల యంతఃకరణ మస్పృశ్యులయం దెట్టిసానుభూతి చూపించుచున్నదో యట్టిసానుభూతి నితరపక్షములవారు చూపింపలేరు. రాజకీయక్షేత్రమం దస్పృశ్యుల సాహాయ్యము తమకు దొరకవలెననెడి యుద్దేశముతో నితరపక్షములవా రస్పృశ్యులకుఁ బైకి సానుభూతి కనఁబఱచుచున్నారు. వారు స్వయముగాఁ బాశ్చాత్యుల నడవడి ననుకరించెడివారు. సనాతనులన్ననో శాస్త్రవిరుద్ధములైన యస్పృశ్యుల యాచారమును స్పర్శను నిషేధించుచున్నారు. దీనినిబట్టి రిఫార్మరులు సనాతను లస్పృశ్యుల ద్వేషించెదరను నపకీర్తి దెచ్చుచున్నారు. సనాతనులు వారిని స్పృశింపకపోవుటయే కాని వారి యాదాయములో నష్టికలుగఁ జేసెడిపని యేమియుఁ జేయరు. రిఫార్మరు లట్లు రుజువుచేయఁజాలరు. శ్లో॥ సర్వేచ సుఖిన స్సంతు సర్వే సంతు నిరామయా అనున్యాయమునఁ బ్రాణిమాత్రము సుఖియై నీరోగియై యుండవలెనని సనాతనుల కోరిక. రాగద్వేషములు నిర్మూలములైనఁ గాని కల్యాణము గలుగదని బోధించు సనాతనులు మఱియొకరిపై రాగద్వేషములు వహింతురనుట యసంభవము.

## కాంగ్రెసు పుట్టుక, ఆరంభమందు దాని నీతి.

10. శాసనములవలనఁ గలిగిన ప్రజల యసంతోషము క్షోభము సమష్టిరూపము ధరించి సామ్రాజ్యమును విచ్ఛిన్నముఁజేయునని రాజనీతిజ్ఞులైన శాస్త్రకర్తలు

కట్టిగా గ్రహించిరి. దినదినమునకు భారతీయ ప్రజలలో క్షోభ హెచ్చుచున్నదనియు, దాని శమింపఁజేయు టవసరమనియు 1880 వ సం॥ గ్రహించి యేజహ్యూమ్ సాహేబను రాజనీతిజ్ఞుఁ డుద్యోగమునుండి విరమించిన వెంటనే 1885సం॥ కాంగ్రెసు స్థాపన చేసెను. ఇంజనులోని యావిరి పోనీయని యెడలఁ బగులును. సందిచ్చి పోనిచ్చిచో స్థిరముగా నుండును అటులనే ప్రజాభిప్రాయము వెల్లడించుట కవకాశమొసంగుచో క్షోభము తగ్గుననియు లేనిచో రాజ్యభంగమగుననియు నాబుద్ధిశాలి గ్రహించెను. కాంగ్రెసు స్థాపన ప్రధానోద్దేశ మిది. ప్రజల యసంతోషము దాని కారణము రాజ్యకర్తలకుఁ దెలుపుటయే దాని ముఖ్యోద్దేశము. అట్టి యసంతోష కారణములు తెలియనిచో నాంగ్లేయ ప్రభుత్వమే ధ్వస్తమగును. ఇట్టి యుద్దేశ మారంభమం దెంతయో యంతయో కొంతకాలము ఫలించుచుండెను. కాంగ్రెసును స్థాపించుట వలన మఱియొక్క పరిణామము దేశస్థులకు ఘటించినది. బుద్ధిశాలులును దూరదర్శులును దేశహితైషిణులును నొక రాజనైతిక క్షేత్రమందుఁ జేరి కార్యములు చేయుట కవకాశము కలిగినది. అప్పటి బుద్ధిశాలులగు దేశనాయకులు కాంగ్రెస్సు ద్వారమునఁ గేవల రాజనైతిక విషయములే విచారింపఁబడునుగాని ధర్మసంబంధము సమాజ సంబంధము విచారింపఁబడఁగూడదని సిద్ధాంతీకరించిరి. భరతవర్షమం దనేకవిధములైన ధర్మములు ననేక ప్రకారములైన యాచారములు నడచుచున్నవి. వానిపై హస్తక్షేపము చేయుట యీసంస్థ కుచితము కాదు. కేవల రాజనైతిక విషయములఁ దీసికొని వర్తించినచో నితర పరస్పరసాహాయ్యము చేసికొనుటకు శక్తమగును. ఇట్టి సిద్ధాంతము ననుసరించుటచేతనే కాంగ్రెసు ప్రబలమైన శక్తిని సంపాదించినది. దీని ప్రభావము రాజ్యకర్తలపైఁగూడ స్థాపింపఁబడినది. కనుకనే రాజ్యకర్తలు మెల్ల మెల్లగాఁ గాంగ్రెసువారి ప్రార్థన లంగీకరించి చిన్నచిన్న యధికారము లీయ మొదలిడిరి.

### కాంగ్రెసు స్పష్టనీతిని వదలుట.

11. ఇట్టి సర్వమాన్యమైన నీతి ననుసరించి పనులు చేయుటచేతనే రాష్ట్రీయ వృత్తికి వికాసము గలిగెను. జనులలో స్వదేశాభిమానము హెచ్చుచు వచ్చెను. రాజనైతిక క్షేత్రమందుఁ బ్రజ పదార్పణ మిడుట (ఆదాయవ్యయముల విషయమై జోక్యము పుచ్చుకొనుట) మొదలిడియెను. ఇట్టి కారణములచేతనే కాంగ్రెసుకు నమ్మఁదగిన సంస్థయని గొప్పగౌరవ మేర్పడెను. ఇట్టి కార్యక్రమము 1920 సం॥ వఱకు నడచుచు వచ్చెను. ఆసం॥ మొదలు కాంగ్రెసు నీతి మార్పుఁజెందుచు వచ్చెను. అది తన నీతిని మఱచి యమార్గమందు బహువేగముగాఁ బరుగెత్తుటకు మొదలిడెను. ధార్మికచర్చలకు దూరమం దుండుటకుఁ జేసిన ప్రతిజ్ఞ నతిక్రమించి చర్చింప మొదలిడియెను. ఇది కాంగ్రెసుయొక్క గొప్ప ప్రమాదము. విచారశీలురగు ప్రముఖులకుఁ బూర్వమందుఁగల భక్తిశ్రద్ధలు తొలఁగిపోవుట కిదియే కారణము. కాంగ్రెసుకుఁగూడ 15 సం॥ల క్రిందనున్న ప్రభావ మిప్పుడు లేదు. ఇప్పటికిని గాంగ్రెసులోఁ జేరియున్నవారిలో బహుజనులు దేశహితమునకంటె ధర్మవిరోధియగు దురా

గ్రహమునకే స్థానమిచ్చెడివారలు. వీరు కాంగ్రెసులో మన నుపకరించుటకుఁ జేరలేదు. మతధ్వంసమునకే చేరియున్నారా యేమియని వోట్లనిచ్చువారు సూక్ష్మదృష్టితో గమనింపవలెను.

## కాంగ్రెస్సు హిందువుల హితము నుపేక్షించుట, హిందూమహాసభా స్థాపనము.

12. కాంగ్రెసు స్థాపనకాలమునుండి తురకల సాహాయ్యము కడుఁ దక్కువగా నుండెడిది. క్రమముగాఁ దురక లందుఁ జేరుట యధికమగుచు రాఁగానే సర్కారు వారు వారుకోరిన కోరికల సఫలపఱచుచు దానినుండి వారిని జీలఁదీయుటకై రాజనీతి నుపయోగించిరి. వారు కాంగ్రెస్సుకును సర్కారుకును దగాదావచ్చువిషయములలోఁ బ్రత్యక్షముగనో పరోక్షముగనో సర్కారుతో నేకీభవించుటకు మొదలిడిరి. కాంగ్రెస్సు తురకల సాహాయ్యమునే ప్రధానముగాఁ గోరుచుండెను. కాని ఖిలాఫతు (మతవిషయస్వాతంత్ర్యభంగ) సమస్య వచ్చువఱకు దానికి మహమ్మదీయుల సహాయోగ మేమాత్రము ఘటింపలేదు. కాని యట్టిసమస్య వచ్చుటతోడనే మహమ్మదీయులకు హిందువులయొక్క కాని కాంగ్రెస్సుయొక్క కాని సహానుభూతిని సంపాదించుకొనుట యావశ్యకమై తోఁచెను. హిందువు లిదివఱకే మహమ్మదీయుల సహాయోగమును రాష్ట్రీయతకుఁ గోరుచుండిరి. దానినిబట్టి తురకలు హిందువులతోఁ గార్యవశమునఁ గొంతకాలము మిత్రులవలె నటించిరి. కాంగ్రెస్సు ఖిలాఫతుసమస్యయందు సంపూర్ణముగా సాయముచేసెను. కాని తురకలు కాంగ్రెస్సునకుఁ దమ సాయ మత్యంతావశ్యకముగా నున్నదని గుర్తెఱిఁగి యాయాసమయములయం దధికములైన కోరికలఁ గోరసాగిరి. హిందువులకు మహమ్మదీయులకు నైకమత్యము చెడకుండ నుండవలెనను నుద్దేశముతోఁ గాంగ్రెసునాయకులు వారి కోర్కులు దీర్చుటయే తమ కర్తవ్యముగా నెంచి నెఱవేర్చుచుండిరి. స్వార్థప్రధానమగు మహమ్మదీయుల నీతి దినదినప్రవర్ధమానమగుట గాంచి విచారశీలురగు హిందూనాయకులు కొందఱు "వీరి తృష్ణ దినదినాభివృద్ధినొందుచున్నది, ఐక్యభంగభయముచేఁ గాంగ్రెస్సు వీరి కోర్కులఁ దీర్చుచున్నది, ఇట్టి కాంగ్రెస్సుపద్ధతి హృదయదౌర్బల్యమునకు నిదర్శనము, ఇందువలన హిందువుల యర్థములు వికటించుచున్నవి, కనుక మనము కాంగ్రెస్సునుండి చీలుటయే హితకరము" అని తలఁచిరి. అప్పుడు హిందూమహాసభాస్థాపనము చేయఁబడియెను. ఈసభ స్థాపింపఁబడుట కాంగ్రెస్సు ప్రణాళికలో గొప్పపరివర్తనమని చెప్పఁబడఁదగియుండును. దీనినిబట్టి హిందువులకు నష్టిగలిగెడి సమస్యలు వచ్చినప్పుడును గాంగ్రెస్సు మహమ్మదీయులతో నైకమత్యము చెడునను భయముతో వారికే సాయము చేయునను సంగతి వెల్లడియాయెను. శాసనసభలలో హిందువులకు స్వాతంత్ర్యభంజకములగు సమస్యలు వచ్చినప్పుడు మహమ్మదీయులతో నైకమత్యము చెడునను భయముచే మౌనావలంబనమే కర్తవ్యముగాఁ దలఁచిరి. కాంగ్రెస్సు హిందువుల హితరక్షణమం దసమర్థమైనదని సారాంశము.

## కాంగ్రెస్సు హిందూధర్మముపైఁ జేసిన యాక్రమణము.

13. నానాజాతుల మెంబరులతో నిండియుండిన కాంగ్రెస్సొకసంఘము యొక్క యీ మతవిరుద్ధమగు సమస్య చర్చించుట కేవలాన్యాయము. అట్టిసంగతిని గుర్తెఱింగియుఁ గాంగ్రెస్సస్పృశ్యతానివారణపు బిల్లు ప్యాసు చేసెను. విచారింపఁగా నీకార్యము హిందూధర్మము బాగుగా గుర్తెఱుఁగనట్టియుఁ బ్రసిద్ధినిగోరునట్టియుఁ గొందఱకే యిష్టమై యుండెను. ఇతరులగు కాంగ్రెస్సు మెంబర్ల కిది యిష్టముగాదు. ఐనను నదూరదర్శులగు కార్యకర్తలు వారికోర్కెలనే సఫలపఱచిరి. కాంగ్రెస్సు చేసిన గొప్పపొరపాటులలో నిది యొకటి. దేవాలయముల నిర్మాణము దాని ధర్మము నాగమశాస్త్రములపై నాధారపడియున్నది. ఏమందిరములలో నెవరికిఁ బ్రవేశించుటకు శాస్త్రానుసారముగా నధికారము లేదో యట్టిమందిరములలో నట్టివారిఁ బ్రవేశపెట్టుటకై బెదరించుచు నట్టి ప్రవేశ మీయనిచోఁ బ్రాణత్యాగము చేయుదుమని ప్రతిజ్ఞ చేయువారి ననుకరించి వారికోరికల ప్రకారము వర్తించుట కాంగ్రెస్సునకు బాలలీలయని చెప్పఁబడును. ధర్మశాస్త్రములను మన్నింపక యిచ్ఛానుసారముగా నసవర్ణవివాహము మొదలగు హిందూత్వనాశనవిధానములఁ బ్యాసు చేయించుటకై బద్ధకంకణులగు వారిని నాయకులుగాఁ జేర్చుకొనిన కాంగ్రెసును దమసంస్థగా నేయాస్తికుఁడైన హిందువు తలఁచును? కాంగ్రెస్సు హిందూమహమ్మదీయులకు సౌహార్దము సంపాదించుటకు యత్నించుచున్నది. అది సంభవింపకపోవుట యటుండ హిందూనాయకులలో నొకరితో నొకరికిఁ గలహమేర్పడినది. అసవర్ణులు సవర్ణులతో వేఱుపడిరి. ఈకాంగ్రెస్సునాయకుల దుస్సాహసముచేఁ జేయఁబడిన నియమాతిక్రమణముచేతను దుష్టమైన శిక్షణపద్ధతిచేతను బ్రతియింటను గొప్పగొప్పమతభేదము లేర్పడినవి. ప్రతిగృహమును గలహపూరితమైనది. తండ్రితోఁ గొడుకు స్త్రీతోఁ బురుషుఁడు భార్యతో భర్త ప్రభువుతో సేవకుఁడు మతభేదములను బట్టి కలహింపఁజొచ్చిరి. హిందువుల ధార్మిక సామాజిక నైతిక రాజనైతికాది నియమము లన్నియు నస్తవ్యస్తములైనవి. హిందూజాతి దినదినమునకు నధోగతిఁ జెందుచున్నది. ఇదియంతయుఁ గాంగ్రెస్సుయొక్క శిక్షకుఁ బరిణామము.

## కాంగ్రెస్సులోని సామ్యవాదము.

14. సమాజసత్తావాదులును సామ్యవాదులును గాంగ్రెసులోఁ జొరఁబడి యీసంస్థ ద్వారమునఁ దమ యిష్టముల నెఱవేర్చుకొనుటకుఁ బ్రయత్నములఁ జేయుచున్నారు. దీనినిబట్టి భవిష్యత్కాలములోఁ గాంగ్రెస్సుమూలమున వీరియత్నములు ఫలించి దేశమున ననర్థములు సంభవించునని భయము పొడముచున్నది. కాంగ్రెస్సు సభాపతియగు జవహర్‌లాలు నెహ్రూగారు ధర్మముతో మాకేవిధమైన సంబంధమును లేదని స్పష్టముగాఁ జెప్పుచున్నారు. ఇదియునుగాక శ్రీమంతులు జమీందారులు మొదలగువారి సంపత్తులు నాశనముఁ జెందుటవలన నీదేశమున నున్నతి ఘటింపదని

చెప్పుచున్నారు. భారతవర్షమునందుఁ బ్రబలమైన పరివర్తన మావశ్యకమనియుఁ జెప్పుచున్నారు. కాంగ్రెసుకు వెనుకటిసభాపతియగు రాజేంద్రబాబు మొదలగు వారలిట్టి సామ్యవాదము నంగీకరించినవారలైనను సర్కారువారు క్రాంతికారకుల నణఁచివైచెదరు గాన నిప్పుడీయత్నము ఫలింపదను రహస్యము గ్రహించి కాఁబోలు నింకను గొంతకాలము ప్రతీక్షచేయవలెనని చెప్పిరి. వీరి యుద్ధతియభిప్రాయ మొక్కటియైనను నొకరు విలంబ మపేక్షించుచున్నారు. ఒకరిప్పుడే చేయవలె ననుచున్నారు. మనమీసంగతి యిప్పుడే స్పష్టముగాఁ జెప్పితిమేని జనులు జాగరూకు లగుదురు. కాంగ్రెసుమెంబర్లకు వోట్లు దొరకవు. జమీందారులవలనను ధనికుల వలనను సహాయము ఘటింపనేరదు. ఇపుడు జరుగుచున్న సహాయముగూడ వికటించునని రాజేంద్రబాబు గ్రహించియుండును. ఇట్టియభిప్రాయములుగల కాంగ్రెసభ్యుల చేతులలోనికి దేశపరిపాలనాధికారము పోయినప్పుడెట్టియనర్థము గలుగునో తెలియుటకై రష్యాదేశమం దిరువది సం॥ లనుంచి జరుగుచున్న పరిపాలనాపద్ధతిని విచారించు టావశ్యకము.

## సామ్యవాదస్వరూపము.

15. విచారింపఁగా సామ్యవాదము ధర్మమునకు విరుద్ధమేయైనను దానిచే జనులకుఁ దప్పక యైహికసుఖము ఘటించునని సామ్యవాదులు భావించిరి. ఇది గొప్ప పొరపాటు. సామ్యవాద మాసురతత్త్వముపై నధిష్ఠితమై యున్నది. రష్యా దేశమందుఁ బదిపండ్రెండులక్షల రౌడీలగుంపు కలదు. అది యచ్చటి ప్రజల వివశులఁ జేసి తన యభిప్రాయము కొనసాగించుకొనుచున్నది. ప్రజల సంపత్తితో నీసంఘ మానంద మనుభవించును. యుద్ధసామగ్రి బలపఱచుకొనుచున్నది. దీనినిబట్టి రష్యా ప్రజలు సామ్యవాదముచే నానందమనుభవించుచున్నారని జను లెంచెదరు. ఈసంఘ మారంభమునందుఁ దమ రాజును దత్కుటుంబమును బలవంతముగాఁ జంపివేసినది. ధర్మమును నామరూపములు లేకుండ నెగురఁగొట్టినది. ఇంతియే కాదు. ఈశ్వరతత్త్వమునుగూడ దేశములోనుంచి వెళ్లఁగొట్టినది. ఆరంభమందు ధనికుల ధనమును జమీందారుల భూములను లాగికొని వారిని గాల్చివేసిరి. అనేకలక్షల జనులను రైలుడబ్బాలలో నెక్కించి యుత్తరసముద్రమువైపు పంపివేసిరి. వారలక్కడ క్షుత్పిపాసాపీడితులై యతిశీతబాధచే నశించిరి. అట్లు నశింపవలెననియే వారాపని చేసిరి. మఠములను మందిరములను లాగికొని ముసాఫరిఖానాలుగా నుపయోగించిరి. వివాహసంబంధమును నిర్మూలముచేసి పశ్వాచారమును బ్రవర్తింపఁజేసిరి. ఆదేశమందు నీతండ్రియెవరన్నఁ జెప్పలేని ప్రజలు లక్షలు. లక్షలప్రజలు చంపఁబడుచున్నారు. ఇట్టి కుచక్రములలోఁ బడి ప్రజలు నానాకష్టములపా లగుచున్నారు. కాంగ్రెసు ద్వారమున నిట్టి మతము మనదేశమందును బ్రవర్తింపఁజేయవలెనను వారలిట్టి దుస్థితి సంభవించునని గమనింపరైరి. భారతదేశమందు రాజసత్త ప్రబలియుండుటచే సామ్యవాదము ప్రచారముచేయుటకు సంపూర్ణముగా నిపుడు లభింపలేదు. కనుక శాసనసభలలోఁ బ్రవేశించి సంఘమును సంస్కరించెదమను పేరుతో

వారు తమ కోరికలను నెఱవేర్చుకొనుటకుఁ బ్రయత్నించుచున్నారు. మెల్లమెల్లగాఁ గ్రమక్రమముగా ధర్మవిరుద్ధములగు చట్టములఁ బ్యాసుచేయించి ధర్మహీనులగు జనులను గ్రొత్తసంఘముగా నేర్పాటుచేయుటకై యత్నించుచున్నారు. వీరి మనస్సంకల్పము లతిభయంకరములని జనులు బాగుగా గ్రహింతురుగాక. ధార్మికసిద్ధాంతములను సామాజికసిద్ధాంతములను మాన్యముగాఁ దలంచువారు రట్టి ప్రజలపట్ల విశేషముగా జాగరూకులై యుండితీరవలెను. తమ కేయధికారము లేనప్పుడే కాంగ్రెసులోఁ జేరి యున్ని యిక్కట్లఁ దెచ్చిపెట్టుచున్నారే! అట్టివారికి సంపూర్ణాధికారమే కలిగిన దేశ మెట్టివిపత్సముద్రమున మునుఁగునో యెవరు చెప్పఁగలరు?

## కాంగ్రెసుయొక్క విపరీతవ్యవహారము.

16. ఈలౌకికుల యాచారము విచారము మొదలగువానిలో నెంతవిరోధమున్నదో యీపద్ధతి యెంత హేయమో యించుక విచారము చేసితిమేని యీసంగతి స్పష్టపడఁగలదు. మేము సర్కారుకు విరోధులమనియు నేవిషయములోను సర్కారుతో నేకీభవించువారము కామనియు మొదలు జనులకు వెల్లడించి నమ్మించిరి. ఇప్పు డీకాంగ్రెసునాయకులే యసెంబ్లీసభలలోఁ బ్రవేశించుటకై యొక పన్నగడఁ బన్నిరి. రాజకీయమైన యసెంబ్లీసభ ద్వారమున ధర్మవిరోధులైనట్టియు సమాజవిధ్వంసకములగునట్టియు నాక్టులను జనులపైఁ దెచ్చిపెట్టుటకు యత్నము చేయుచున్నారు. ఏధనికుల ధనముతోఁ దమ యుద్యమముల నన్నిఁటిని నెఱవేర్చుకొనుచున్నారో యట్టిధనికుల సర్వాధికారములను పికటించుట కుద్యుక్తులై యున్నారు. జనులకు స్వాతంత్ర్య మిప్పించెదమని ఘోషించుచున్నారు కాని పరిశీలించిచూడఁగా నేస్వాతంత్ర్యము కౌటుంబికవ్యవహారములలోఁ బ్రాప్తమై యుండెనో దానిఁగూడ నశింపఁజేయుటకై పరధర్మనిరతముగు సర్కారు ద్వారమున నాక్టులను జేయించుచున్నారు ఎక్కువ వ్రాయవలసిన యవసరముండదు. ఈ యొక విషయమును బట్టియే వీరి సంపూర్ణకుచేష్టను జనులు గ్రహింపఁగలరని తలంచెదము. కాంగ్రెసునాయకులు మేము భారతవర్షౌన్నత్యమును బరమావధికిఁ దెచ్చెదమని నోటితోఁ జెప్పెదరు. ధర్మము విధ్వంసము చేయుటచే భరతవర్షమున నున్నతి యెన్నటికిని ఘటింపదని జనము గట్టిగా నమ్మవలెను.

17. ఏసంఘమును నిందించుట యీలేఖ యుద్దేశము కాదు. వస్తుస్థితిని మీయెదుట నుంచుచున్నాము. కాంగ్రెసునాయకులు బ్రాహ్మణస్త్రీని శూద్రుని కంటఁగట్టియు నంత్యజస్త్రీని బ్రాహ్మణునకు వివాహము చేసియుఁ దాము హిందువులుగా వ్యవహరించుచున్నారు. వీరలే దేవాలయముల ప్రతిష్ఠను విఘటనచేయుటకై యత్నించిరి. ఇప్పుడును నసెంబ్లీలో నిట్టి విరుద్ధములైన బిల్లుల నెన్నిఁటినో విచారార్థము పెట్టియున్నారు. జాతినియమముల నుల్లంఘించి జరిపిన వివాహములు హిందూధర్మశాస్త్రసమ్మతములని వీరు తలంచెదరు. వీరిలోనసే యొక మహాశయుఁడు స్త్రీపురుషసంతానమునకు సమానదాయభాగ ముండవలెనని యొకబిల్లును దెచ్చిపెట్టి యీద్వారమున నంతఃకలహములఁ బెంచుచున్నాఁడు. ధర్మశీలుర హృదయములను

దపింపఁజేసెడి యస్పృశ్యతానివారణపు బిల్లును శారదాయాక్టు నింకను నిర్బంధపూర్వకముగా నమలులోఁబెట్టవలెనను బిల్లును విచారార్థము దాఖలుచేసియున్నాఁడు. ఇట్టివారలు కవున్సిలుసభలలో నధికారారూఢు లగుచో స్వరాజ్యప్రాప్త్యాశ యటులుండఁ బ్రథమము హిందూధర్మముల నష్టపఱచుటకే వీరియత్న ముపయోగించెడి. కనుక నోసుజనులారా! మీకు వోటులిచ్చుట కధికారము గలదు. వీరు చేసిన పనులను జేయఁబోయెడి పనులను బాగుగా విచారించుకొనుఁడు. ధార్మికవిషయములందు సామ్యవాదమే యుండవలెనని వాదించెడివారే కాంగ్రెసులో బహుజనులు కలరు. ఈసంగతిని బాగుగా గమనింపుఁడు. మీకు హిందూజాతి కొంతకాలము ప్రపంచములో నుండవలెనని యభిప్రాయ మున్నచో హిందూజాతియం దభిమానముగలవారలకే మీవోట్లు నిండు.

హిందూమహాసభ.

**18.** ఇంతవఱకుఁ గాంగ్రెసులోఁ జేరి కార్యముచేయువారల పక్షములు ప్రదర్శింపఁబడినవి. హిందూమహాసభ స్వరూపము కొంచెము విచారింపవలసియున్నది. హిందూమహాసభ రాజకీయములు సాంఘికములు నగు విషయములందు హిందూప్రజల హితమును రక్షించుట కుద్దేశింపఁబడినది. అంతటియుద్దేశముతోడనే యుండి ధర్మవిరుద్ధములైన బిల్లులను నిషేధించునెడల నాసంఘముతో సనాతనధర్మపక్షులకుఁ బ్రతిఘటించుట కవసర ముండకపోయెడిది. వారలు పరధర్మీయుల యాక్రమణమునుండి హిందూసమాజమును రక్షించుకొనుట మాకును మాన్యమే. కాని హిందూసమాజము హితసంరక్షణమను మిషతో ధార్మికవిషయములయందు హస్తక్షేపము చేయుచున్నది. అస్పృశ్యతను మొదలంట నశింపఁజేయుట దాని ముఖ్యోద్దేశము. అప్పుడు మనము వారివలన ధర్మరక్షణ మాశించుట యసంభవము. ఈసంస్థకు ధర్మవిషయమై యనాదరము గలదు. అస్పృశ్యతను నిర్మూలముఁజేయుటయందుఁ దత్పరత గలదు. కులభేదములను ఖండించుటయందుఁ బట్టుదల గలదు. ఇది యంతయుఁ జూడ నీసంస్థకు హిందూజాతియందును హిందువుల రక్షణమందును రాజకీయక్షేత్రమున హిందువుల కుత్కర్ష గలుగుటయందును దత్పరత గలదు కాని హిందూధర్మమందుఁగాని హిందూ సంస్కారములయందుఁగాని యాదర మెంతమాత్రము లేదు. కనుక నీసంస్థలోని సభ్యులు మే మసెంబ్లీసభయందు ధర్మవిరోధు లగు బిల్లుల రద్దుపఱచుటకు సాయము చేసెదమనియు నధర్మవిషయమైన బిల్లులఁ బ్రవేశ పెట్టమనియు నెవ్వరేని ప్రవేశపెట్టుచో నిషేధించెదమనియు దృఢమైన వాగ్దాన మిచ్చువఱకు వారికి వోట్లీయఁగూడదు.

అన్యరాజకీయపక్షములు.

**19** ఉదారమతవాదులనియు నతిసహకారవాదులనియుఁ జెప్పువారు మఱికొందఱుగలరు. వారిలో నెన్నిభేదము లున్నను ధర్మరక్షణమునకు మహత్త్వమిచ్చువారు వర్ణాశ్రమస్వరాజ్యసంఘమువారు తప్ప మఱియొక్కరు గాన్పింపరు.

రాజనైతికముగఁ గాని యార్థికముగఁ గాని లాభము కలుగునని తోఁచినచో ధర్మమును దిగఁద్రొక్కుటలో వీరందఱును సమానులే. కొందఱు ధర్మము తమ యభ్యుదయమునకు భంగకారియని తలంచెదరు. వారిట్లు తలంచుట యజ్ఞానమూలకము. ధర్మ మున్నతికొఱకే యేర్పడినది. యుద్ధము మొదలగు నవసరములు కలిగినప్పుడు వైదికనియమములందుఁ జాల సంకోచము కలదు. ఆపదలు నివారించిన యనంతర ముచితసంస్కారములఁ బొంది మరల స్వస్వధర్మముల నాచరించుటకు వ్యవస్థ కలదు. వర్ణాశ్రమధర్మపరులు వర్ణాశ్రమధర్మముల రక్షించుకొనుచు నితరమానవవంశములకంటె నధిక కాలము ప్రజాపరిపాలనము చేసియుండిరి. వారి శాసన మత్యుత్తమముగా నెంచఁబడినది. రామరాజ్యపు టుదాహరణ మీదినమునకును నాదర్శరూపముగ వెలుఁగుచున్నది. కొన్ని పాశ్చాత్యరాజ్యముల భౌతికోన్నతినిజూచి ధర్మ మున్నతికిఁ బ్రతిబంధకమని కొందఱు తలంచుచున్నారు. అది పొరపాటు. ధర్మహీనములగు రాష్ట్రము లెన్నియో నిర్మూలములగుట వినియున్నారము. ఉన్నతికిఁ గారణము యథార్థపురుషార్థము. హృదయముయొక్క యుదారత. ఆచరణముయొక్క పవిత్రత. దీనినే "శబ్దః ఖే పౌరుషం నృషు" అని వైదికధర్మసారాంశము గీతలయందుఁ జెప్పెను. వైదికధర్మము రాష్ట్రోన్నతికిఁ బ్రతిబంధకము కాదు. ఎవరు దీనిఁ బ్రతిబంధకముగఁ దలఁచెదరో వారు ప్రత్యక్షవిరోధులు. అట్టివారికి వోట్ల నీయఁగూడదు. ఎవరు ధర్మ ముపేక్షణీయముగఁ దలంచెదరో వారు మనము కోరిన వాగ్దానముల నిచ్చిరేని వారికి వోట్ల నీవచ్చును. (సశేషము)

## —♦ పాతివ్రత్యప్రభావము. ♦—

(శ్రీనాథుని కాశీఖండము.)

మ. పసుపుం గుంకుమ కజ్జలంబు నును గూర్పాసంబు తాంబూలమున్
కుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్
విసు వొక్కింతయు లేక తాల్పవలయున్ వీనిన్ సదాకాలమున్
పసి చక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్. ద్వి. ఆ.

తే. రజకితోడ నుదక్యతో శ్రమణతోడ
విధవతో నాథుతోరాయు వెలఁదితోడఁ
జెడిపెతోఁ జాలఁ బోరామి సేయఁజనదు
ప్రాణసంకటములను బుణ్యాంగనలకు. 74

సీ. పతి పిల్వఁబంచినఁ బనియేమియని వచ్చి
చెప్పిన యుడిగంబు సేయవలయు.
భర్తయానతిలేక ప్రకృతిబంధునకైన
నేపదార్థంబును నీగి నెట్ట.
జీవితేశ్వరుఁడు డించిన యోగిరంబులు
కుత్ససేయక భుక్తిగొనుట తగవు.
సుఖసుప్తుఁడగు నిజేశుఁ బ్రబోధమొనరింపఁ
గా దనుస్థానభంగమునఁ దప్పు.
ఒంటి నెచ్చోట కరుగుట యుక్తిగాదు.
తడుపుగట్టక నీళ్ళాడఁ దగవుగాదు.
కడపమీఁదను మఱి సన్నకంటిమీఁద
జక్కిమీఁదను గూర్చుండ జాడగాదు. 75

కం. కాంతుఁడు సంతోషించినసంతోషింపంగవలయుసతి. కతఁడార్తన్
సంతాపించినపట్టున సంతాపింపంగవలయు జలజేక్షణకున్. 78

సీ. చీఁకటితప్పు చేసిన సరోరుహనేత్రి
గూబయై వసియించుఁ గోటరమున
వింతవావిఁ గటాక్షవీక్షణంబునఁ జూచు
కిసలయోష్ఠి వహించు గిల్లకన్ను
మగఁడు దన్ మొత్తిన మార్మొత్తు నలివేణి
వ్యాఘ్రియై జనియించు వనములోన
చిఱుదిండి తనవారి మొఱఁగి యాహారించు
అతివ సూకరజాతియందుఁ బుట్టు
అధిపుఁ గోపించి హుంకార మాచరించు
పడఁతి మూఁగవు. సవతి సౌభాగ్యలక్ష్మి
చూడఁజాలక మదిలో నసూయసేయు
భామ దుర్భగయగు నన్యభవములందు. 80

ఉ. దూరముపోయి యెండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటగేహములదాఁక నెదుర్కొని తీర్థమార్చి యా

హారము వెట్టి పీడ్యము సమర్పణ చేసి విహారశయ్యపై
ఊరువులొత్తి చిత్తమున కుబ్బ్చనరించుట ధర్మ మింతికిన్. 81

తే. గీ. తగవు పాటించి యల్పంబు తండ్రి యిచ్చు.
అల్ప మల్పంబ భ్రాతయు, ఆత్మజుండు.
పార్థితంబైన ధన మనల్పముగ నిచ్చు
ప్రాణనాథుని సరియె యేబంధువులును? 82

తే. గీ. పెక్కుమాటల నిటు జాగుపెట్టనేల?
సాధ్వి ఘర్షింప నొకండె ట్లుచాలఁగలఁడు?
గంధవాహంబు వెఱచు నక్కలువకంటి
పసుపుపయ్యెద పాలింప్లఁ బోయఁదట్టె. 88

తే. గీ. ఔర్వశిఖికంటె శిఖికంటె నర్కు కంటె
పిడుగుకంటెను దీవ్రమై బిఱుసుచూపు
ఆత్మఁ దప్పఁగఁ దలఁచు దురాత్మకులకు
అహాహ! పతిదేవతా ప్రభావాతిశయము. 89

తే. గీ. తండ్రివంశంబునం దేడుతరములకును
తల్లివంశంబునం దేడుతరములకును
ధవునివంశంబునం దేడుతరములకును
శాశ్వతస్వర్గసౌఖ్య మిొఁజాలు సాధ్వి. 92

---

—♦ శారదాచట్టం తీవ్రరూపం దాల్చాలి, లేకపోతే
సాధుబాధ తప్పదు ♦—

(శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు.)

శారదాచట్టం ప్యాసైన తేదీ మొదలు అమల్లోకివచ్చే తేదీలోపుగా అయిన పసిపిల్లల పెండ్లిండ్లను లెక్కచేయవలసివస్తే కొన్ని డిపార్టుమెంట్లు అదనంగా యేర్పడవలసి వస్తుందని కాఁబోలును గవర్నమెంటువారు వుపేక్షించివున్నారు. ఆసందర్భంలో రజస్వలావివాహం పూర్వం వుండేదా? లేదా అనిన్నీ, సీత, ద్రౌపది, లక్ష్మి, పార్వతి, రుక్మిణి వగయిరాల వివాహాలు బాల్యంలోనే జరిగినవా? లేక రజస్వలానంతరమా? అంటూ చర్చించి చేసిన సిద్ధాంతాలకు పరిమితి లేనే లేదు. గాని యెంత చర్చించినా యిదమిత్థమని మాత్రం తేలినట్లేలేదు.

సనాతనులు కులాచార భంగభీతితో గవర్నమెంటుకు మొఱపెట్టుకున్నారు. కాని జనసంఖ్యనుబట్టి ధర్మాధర్మ నిర్ణయం చేయవలసిన బాధ్యతతోవున్న గవర్నమెంటు

వీరి మొఖమును విన్నట్లేలేదు. బ్రాహ్మణులున్నూ వీరివలెనే ఆచారాదులలో వర్తించే మఱికొన్ని వర్ణాలున్నూ తప్ప యీబిల్లును ఆక్షేపించేవారున్నట్లే కనబడలేదు. గాని ఆచరణలోమాత్రం చాలమంది శూద్రులున్నూ, వారితరువాతవుండే షెట్టిబలిజిలు మొదలయిన వర్ణాలవారున్నూ మరీచిన్నపిల్లలకు పెండ్లిండ్లు నిరభ్యంతరముగా చేయడమున్నూ వారిమీఁద యెవరుగాని కేసు పెట్టినట్లే లేకపోవడమున్నూ సర్వానుభవసిద్ధమే- కనక విస్తరించవలసి వుండదు. ఇంక గాంధిగారు క్రొత్తగా కటాక్షించిన హరిజనబిరుదంవారున్నారు. వారిలో అయ్యే బాల్యవివాహాలకు పరిమితే లేదు. ఆ యీ సందర్భాలు గమనించి కొందరు అమాయక బ్రాహ్మణులు అనుకోంటూవున్నారుగదా! ఊరికే యీబిల్లు పుట్టిందిగాని యిది అమల్లో లేనేలేదనిన్నీ కనక దీన్ని పాటించ నక్కఱలేదనిన్నీ అనుకొని బాల్యవివాహమే చేస్తూవున్నారు. గవర్నమెంటు వుద్యోగం వున్నవారుగాని, లేదా పెన్షను వున్నవారుగాని జీవనానికేముప్పు మూడుతుందో అని రజస్వలఅయిన తరువాతనే చేస్తూవున్నారు. అసలు యీబిల్లంటూ వుంటేనేగాని మనసంఘం బాగుపడదనే నమ్మకంతో వున్నవారు గవర్నమెంటుద్యోగులు కాకపోయినా లోకానికి మార్గదర్శకులు కావడానికో అన్నట్టు కొన్ని రజస్వలలు అతిక్రమించే వఱకున్నూ వుంచి పిమ్మటనే చేస్తూవున్నారు. కాని ఆవలా యీకలా అట్టిపట్టుదల వున్నవారు తటస్థిస్తే కాని వరుఁడు దొరకడం కష్టసాధ్యం అవుతూవుంది... ఆ యీ వివాహాలకు వేదాధ్యయన సంపన్నులేమి, శాస్త్రాధ్యాపకులేమి, యజ్ఞకర్తలేమి వస్తూనేవున్నారు. భోజనం చేస్తూవున్నారో లేదో నేను నిశ్చయంగా చెప్పజాలనుగాని భోంచేసిన వాళ్ళనుమాత్రం బహిష్కరించడంలేదు. ఎవరో గవర్నమెంటువుద్యోగులై వుండి కూడా పరలోకభీతిచేతో, యిహలోకంలో ముసలివాళ్ల బాధచేతో బాల్యవివాహం చేయడమున్నూ దాన్ని కనిపెట్టి యెవరో పుణ్యాత్ములు రూ. 100-0-0 ల ధరావతున్నూ చెల్లించి కేసుపెట్టడమున్నూ అధికారి దయదలచి జీవనభంగం మాత్రం చేయక రు 1000-0-0 లు కాఁబోలును జరిమానా వేసి క్షమించినట్లు యేదోపత్రికలో చదివినవారు చెప్పఁగా విన్నాను. ఇందులో అధికారిచేయఁదగ్గ వుపకారానికి అంతకన్న అవకాశం యేలవుంటుంది? ఆమధ్య ఒకపెద్ద వైదిక సంప్రదాయంలో నుంచి వచ్చిన లౌకికులతో యీలాంటివివాహం చేయడమైతే జరిగిందిగాని అది మఱికొందఱియిళ్ళల్లో జరిగి తేలిపోయినట్లు కాక కేసులోకి రావడమున్నూ జరిమానా యిచ్చుకోవడమున్నూ జరిగింది. కేసంటూ పెట్టకపోవాలిగాని పెడితే తిర్మల తాతాచార్లగారి ముద్రిలాగ జరిమానా తప్పనిదే. కొందఱు ధనాఢ్యులు ఈజరిమానా ద్రవ్యాన్నికూడా పెండ్లిఖర్చులో వకబాపతుగా చూచుకుఁటూవున్నారు. వారివిషయంలో ఆకట్లోవున్న క్షైమశిశువునుకూడా అమల్లోకి తెస్తేతప్ప యీబిల్లుకు వారు జంకరు. ఒక్కొక్కవివాహంలో కాల్చేబాణాసంచాకు పరిమితి వుంటుందా? దాన్ని లెక్కపెట్టని భాగ్యవంతులకు యీబిల్లువల్ల వచ్చే జరిమానా లెక్కలోది యెప్పటికిన్నీ కాదు. ఈకుటుంబాలవారు సంఘసంస్కర్తలైతే తప్ప తదితరులు మనశాస్త్రాన్ని అనువర్తిస్తూనే వుంటారు. ఈమహాప్రళయంలో ఈపుణ్యాత్ములవల్లనే ఈశాస్త్రం రక్షించఁబడవలసివుండి, ఫ్రెంచిపట్నం యానాంలోకూడా క్రమంగా ఈవివా

హాలు జరగడానికి వీలు కనపడదంటూ వక పుకారు బయలుదేరింది. ఆగ్రామంలో అంతో యింతో బాగుపడవలసినవాళ్ళు యిదివఱకే బాగుపడ్డారని వినికి. యింకా పూర్తిగా నిషేధాన్ని ఘోషించివారు ప్రకటించడమైతే జరగలేదుగాని అసలానికి హఠాత్తుగా తటస్థించిన భోగకాలం అంతతో సరిపోయిందో యేమో కాని "నిత్య కళ్యాణం పచ్చతోరణం" అనే స్థితిమాత్రం లోపించింది. అమధ్య ఈలాభం పోయింది గదా అనే విచారంతో వక పెద్దమనిషి యీ అవకాశం ఇంకా కొనసాగించిరిగ వున్నట్టు యేదో పత్రికలో వ్రాసింది చదివినట్లు జ్ఞాపకం. యేమైనా అవకాశా లన్నీ అంతరించినట్లే. ఎవరికీ యీ అంతరించడం ? శుద్ధశ్రోత్రియులు మనుకొనే వారికన్నీ వారిని అనుకరించేవారికీ మాత్రమే....బాగా ఆలోచిస్తే యీ బిల్లు సాధు బాధకోఱకే ఏర్పడ్డట్టు పరిణామాన్ని బట్టి తేలుతుంది. బిల్లుపెట్టినవారి వుద్దేశమేమో సదుద్దేశమే. వారి మతంలో శాస్త్రబాధకూడా వున్నట్టులేదు శాస్త్రమంటే మెజార్టీ పార్టీ అంగీకరించడమేగా ! ఆ అంగీకరించిన వారు వేదప్రామాణ్యంవున్న పూర్వా చారపరాయణులా ? కారా ? అనేదానితో వారికి అవసరంలేదు. ఈ బిల్లువల్ల కన్యావిక్రయ దోషాలు తొలఁగుతా యని కూడా వారి వుద్దేశం కావచ్చును. పద్దాలుగేళ్ళు వచ్చిన కన్యక తల్లిదండ్రులచేత అమ్ముడుపోవడానికి యెక్కడో కాని అంగీకరించదు. అయితే రజస్వలా వివాహాలు వున్న కుటుంబాలలో కొన్ని అననుకూల వివాహాలు జరగడంలేదా అంటారేమో ? జరుగుతూనే వున్నాయి కాని అవి కేవలంగా ధనాపేక్షవల్ల తల్లిదండ్రులు చేసేవి కావు. యెక్కడా వీలైన సంబంధం కుదరక యావజ్జీవమున్నూ కన్యకగానే వుండవలసి వస్తుందని భయపడి పెండ్లికూతురుకూడా విధిలేక అంగీకరించిన బాపతే. అంతేనే కాని నరమాంస విక్రయంలో చేర్పుకో తగ్గవి కావు. యెందరో తల్లిదండ్రులు నరమాంసవిక్రేతలు లేక పోలేదు; వున్నారు. వాళ్ళను ప్రధానంగా చేసుకొని అందరినీ బాధించడం మాత్రం యేంధర్మం ? పోనీ మంచో ? చెడ్డో ? యీబిల్లు ప్యాసుచేశారు బాగా నేవుంది. పరంలో దేవుని ఆజ్ఞ యేలాటిదో, యిహంలో రాజుగారి ఆజ్ఞ అలాఁటిదే అనుకుందా మంటే అందఱికీ యీబాధ తటస్థించక పోవడంచేత యే కొందఱో తప్ప నూటికి 90 మంది బాల్యవివాహాలే చేస్తూ వున్నారు. వారిని యెవరున్నూ కోర్టుకు రప్పించక పోవడంచేత కొందఱు అనుకుంటూవున్నారు గదా మామూలు ప్రకారమే బాల్యవివాహం జరిగించుకోవచ్చు ననియే. తత్త్వం యెఱిఁగిన యేగృహస్థైనా రాబోయేచిక్కుకు ఒంకి పద్దాలుగేళ్ళదాఁకా పిల్లని అట్టే పెడితే యీపిల్లని మేము చేసుకోనేది లేదంటూ బంధువులు నిషేధిస్తూ వున్నారు. ఆపిల్లతండ్రికి యే గవర్నమెంటులోనో వేయో, ఆయిదువందలో జీతమో పెన్షనో వుంటే అలాటి వాఁకే పెళ్ళివారు వస్తారు కాబట్టి చిక్కుండ దనుకోండి. అందఱికీ అలాటి అదృష్టం తటస్థిస్తుందా ? అది అసంభవం. అలాటి కుటుంబాలలోకూడా పూర్వాచార పరాయణురాండ్రు ముసలమ్మలు వుండకపోరు. అట్టివాళ్ళు వాళ్ళ జీవిత కాలంలో యీపిల్ల చేతినీళ్ళు తాగకుండా వుండే వుంటారేమో ? వాళ్ళహృదయంలో యీ కన్యక ధర్మపత్ని అనిపించుకోదనియ్యేవే మన మనుకోవాలి కాని

యిదిమాత్రం శుద్ధాన్యాయంగా కనబడుతుంది. శాస్త్రమ్మాట నేను చెప్పలేదుగాని రాజర్షు లనిపించుకొన్న సత్ క్షత్రియు లెందరో రజస్వలా వివాహాన్ని చేసినట్లు కనబడుతుంది. వారికందరికీ నరకంవచ్చి మనకేనా స్వర్గం రావడం? అని మనవారు సరిపెట్టుకొన్నా కొంతబాగుండేది. ఆరాజులందరూ రజస్వలా వివాహాలైతే చేసినట్లు కనపడుతుంది గాని బ్రాహ్మణులను కూడా తమతోపాటు చేయవలసిందని బలవంత పెట్టినట్లు కనపడదు. అయితే ప్రస్తుతరాజ్యాంగం మాత్రం అలా నిర్బంధించిందా? పాపం లేదు. "మాకు యీవరాన్ని ప్రసాదించవలసిం" దని మనలో కొందరు నాగరికసార్వభౌములు కోరితే ఆలోచించి ఆలోచించి యీవరాన్ని వారు అనుగ్రహించి వున్నారన్నది సత్యదూరం కాదు. ఆ అనుగ్రహించడంలో 141 గో సెక్షను లాగ పోలీసువారి చేతులో పెట్టక యెవ్వరో కేసుపెట్టేవారు గృహస్థులే వుండాలనిన్నీ, వారు నూరురూపాయీలు ధరావతు కోర్టులో దాఖలు చేయాలనిన్నీ యేర్పఱచడంవల్ల యీరూలు కొంత మొరపోయినట్లయింది. అందుచేత చాలామంది అతిక్రమిస్తూ వున్నారు. గతానుగతికంగా వారిని చూచి మరియొకరు అతిక్రమిస్తే కాలకర్మగతిచేత మెడపట్టుకోవడం అంటూవస్తే దండాదండీ ఖర్చులుసహా మూఁడువేలదాఁకా తగిలితే తగులుతుంది. దానితో సామాన్యగృహస్థు కయితే స్థలభాండవిసర్జనం ప్రాప్తించి... "వుపనయనమునాటిమాట వున్నది సుమతీ" అని యాయవారపు చెంబు చేతికి రాక తప్పదు; అన్నట్టు ఆ చెంబు చేతికి వస్తే మాత్రం పెట్టే దెవరు? చిరకాలంనాఁడే యీవృత్తిని అన్యులు ఆక్రమించుకున్నారు. కాని నిన్న మొన్నటిదాఁకా బ్రాహ్మఁడంటే మాత్రం యీవిషయంలో కొంతగౌరవమో, దయో, లోకులకు వుండేది. యిప్పు డదిన్నీ పోయింది. దానికే కాదు. కవిత్వానిక్కూడా బ్రాహ్మణత్వంతో సంబంధం తెంపితేనే కాని వీలు లేదని కొందరు బుద్ధిమంతు లాలోచించారు. మనుపు బ్రాహ్మణేతరులలో మంచి కవులే వుండేవారు కాని వారు బ్రాహ్మలతోపాటు శాబ్దికశాస్త్రాలున్నూ, అర్థిక శాస్త్రాలున్నూ కష్టించి యత్నించి అభ్యసించేవారు. భోజరాజాదులను దీనికి వుదాహరణగా చూచుకోండి. ఇటీవల అలంకారికు లందఱున్నూ భోజరాజుగారి వాక్యాలను ప్రమాణంగా వారివారి గ్రంథాలలో వుదహరిస్తూ వుంటారు. పరిశీలిస్తే యీ విషయం తెలుస్తుంది.

"అంబలే రొచ్చింది అత్తా? అంటే? కాలబుఱ్ఱ నాచేతులోనే వుంది!"

అన్నట్టు మనలో కవిత్వం చెప్పేవ్యక్తులు చాలామంది వుండిన్నీ మన కింకా యీబ్రాహ్మల అవసరం యెందుకని కొంబోలును ఆమాదిరి కవిత్వాన్నే మానేసి స్వతంత్రరచన సాఁగిద్దామని కొందరు బుద్ధిమంతులు సభలు సాఁగిస్తూన్నారు. శాస్త్రసంబంధం తెంపేసేస్తే కవిత్వానికి బ్రాహ్మలతో సంబంధం వుండనక్కఱ లేదు. రచనకే అయితే శుద్ధపాండిత్యమే పని చేస్తుందని నేను చాలచోట్ల వ్రాసే వున్నాను. ఆరవంలో బ్రాహ్మణులలోకన్న బ్రాహ్మణేతరులలోనే మిన్నాకవులున్నారని ఆదేశపు శ్రీవైష్ణవ పండితులు చెప్పఁగావిన్నాను. వివాహాదివిషయాలకు జాతిభేదం మానుకుండా మనుకొనే రోజుల్లో కవిత్వానికి దాన్ని అంటఁగట్టడానికి

ప్రయత్నించే వారి తాత్పర్యం తెలుసుకోవడం చాల కష్టసాధ్యంగా కనపడుతూ వుంది. ఇది విషయాంతరం. ప్రస్తుతం శారదాబిల్లుబాధ, యిది లేదనుకోవడానికిన్ని వల్లకాదు. వుందనుకోవడానికిన్ని వల్లకాదు. కొందఱికి వున్నట్లు కనబడుతుంది. కొందఱికి లేనట్లు కనపడుతుంది. యెవఁడేనా నలుగురిలో తల తిప్పుకొనే వాఁడున్నట్టయితే వాఁడికి యీబిల్లు వుందే అనుకోవాలి, వాఁడిమీఁద నిజమైన ద్వేషం లేకపోయినా యెవరో వినోదార్థమేనా కేసుపెట్టి చూస్తారు. దానితో వాఁడిపని చక్కాపాగడం అయితీరుతుంది. నామరూపాలు లేనివాళ్ళు పురుట్లో వున్న పిల్లలకి చేసినా యెవ్వరూ మాట్లాడినట్లే లేదు. సంఘసంస్కారులు యీబిల్లును కష్టించి సంపాదించి చేసినవుపకారం యెట్టిదో ! లేశమున్నూ బోధపడడంలేదు. దీనివల్లనల్లా యేకొద్దిమందినో పూర్వాచారపుపండితులను చిక్కులో దింపినట్లయింది. బిల్లుకు భయపడి పిల్లని 14 యేళ్ళదాఁకా అట్టే పెడితే కులస్థులు ముసిముసినవ్వులు నవ్వుకుంటూ ముసుగులో గుద్దులాటకు సిద్ధపడి పెళ్ళికి సిద్ధపడరు, సరికదా ? యితరులు సిద్ధపడి చేసుకుంటే భోజనానికి రారు. పబ్బిలీకుకు పెళ్ళి అంటే మర్యాద నష్టపుదావా పడుతుందేమో? అని పూర్వకాలంలో లాగ ఖాలిమాత్రం వేయరు. వీరికి జంకి బాల్యవివాహమే చేస్తే యెవరో కేసుపెట్టితీరతారు. పెట్టరే అనుకుందాం ధైర్యం కలగడం యేలాగ ? అందుచేత యీ బిల్లు పూర్తిగా రద్దయినా బాగుంటుంది. కాని అది జరిగేపనికాదు. కాఁబట్టి యింతకంటె బిగిసి అందఱికీ భయజనకంగా నేనా వుంటే బంధుజనంవల్ల బాధేనా తప్పుతుందేమో ? యీ చిక్కు తెచ్చిపెట్టిన సంఘసంస్కర్తలు అలాటిప్రయత్నమేనా చేసి అసమర్థులైన పూర్వాచారపరాయణులను అనుగ్రహించడం యుక్తమని నాకు తోస్తుంది. లోకోపకారార్థం సర్వస్వాన్నిన్ని ధారపోసి తుదకు ప్రాణాన్నికూడా అర్పించే సంఘానికి యీపని సాధ్యం కాకపోదని నా విశ్వాసం. ఆ సంఘానికేనా యీబిల్లు తొలఁగించడం సాధ్యంకాదె అనుకుందాం. మఱి త బిగఁదీయడాని కేంభాగ్యం? వకరాతిని కాని, ప్రవాహాన్ని కాని, కొండమీఁదకి యెక్కించాలంటే దుర్ఘటంగాని అక్కడనుంచి కిందకి తోయడం సులభసాధ్యమే. నూటురూపాయీలు కట్నపెట్టి పెళ్ళి చేసుకోవడానికి యెందఱినో ఆశ్రయించవలసిన ప్రాచీనాచారపరాయణగృహస్థు దండాదడీ రెండువేల జరిమానా యెక్కడిచ్చుకోఁగలడు? యీలోగా ప్లీడరు ఫీజు వగయిరాలు కోర్టుకు తిరగడానికి యింకా యెన్నో ఖర్చులు యికన్ని తప్పనివే కదా ! అందుచేత పుణ్యమో, పాపమో, భగీరథప్రయత్నం చేసి యీవరాన్ని దేవునివల్ల సంపాదించనే సంపాదించారు. యిది అందఱికీ నిర్బంధంగా వర్తించేటట్టు చేస్తే తప్ప అలా చేయని పద్ధతిని యిది కేవలం సాధుబాధకింద పరిణమించవలసివస్తుంది ; రజస్వలా వివాహంవల్ల వచ్చే చిక్కు పారలౌకికంగాని యిది ప్రత్యక్షంగా కనపడేది ? సంఘంలో కొందఱు వకలాగా మఱికొందరు మఱోలాగా వర్తించడానికి బిల్లులో అయితే అవకాశం లేకపోవచ్చు ; గాని ఆచారంలో అవకాశం కనబడుతూవుంది. ఆకొస్త అవకాశమున్నూ లేని పద్ధతిని బిల్లు బిగించడం జరిగితే ప్రస్తుతపుచిక్కు వదలిపోతుంది.

"న దుఃఖం పంచభిస్సహ" కనక అంతా కలిసి స్వర్గానికో నరకానికో

వెళ్ళవచ్చునని ఈలా వ్రాయడంగాని యీ బిల్లు బిగదీయడంద్వారా దొంగతనంగా పూర్వాచారాలను కాపాడుకొనే వారిని అధోగతికి తేవడం నా తాత్పర్యం కాదు. అసలు బిల్లుపోవడం నాకున్నూ యిష్టమే. దానికి తగ్గంత సంఘం యీ కాలంలోనే కాదు, పూర్వకాలంలో కూడా లేనేలేదు. అయితే ఆ కాలంలో ప్రజలు యీ ఆచారంతో అవసరం లేనివారు కూడా. దీన్ని మన్నించేవారిని ప్రోత్సహించేవారు. ఈ కాలంలో మన్నించే తెగవారు కూడా మన్నించనివారిలో చేరి కుంగదీస్తున్నారు. ప్రభుత్వమో! జనసంఖ్యనుబట్టి నిర్ణయిస్తూవుంది. గవర్నమెంటు కలగజేసికోని సందర్భాల్లో తప్ప కలగజేసుకున్న సందర్భాల్లో పూర్వాచారాలు యింకా సాగవని వేరే చెప్పనక్కరలేదు. విద్యావతులైన స్త్రీలు కొందరు కూడా ఈ బిల్లుకు అనుకూలురాండ్రుగా ఉన్నారు. దీనికే కాదు, వితంతూద్వాహానికిన్నీ, విడాకుల చట్టానికి ఇంకా వెనకాముందూ వూగుతూవున్నట్టు కనపడుతుంది. ఈ బిల్లువల్ల వరకట్నాలేమేనా తగ్గాయా? పైగా హెచ్చాయి కూడాను. దొంగతనంగా బాల్యవివాహం చేసి జరిమానాలపాలు కావడమే కాకుండా కోర్టులమ్మట తిరిగి తిరిగి శ్రమపడడం కంటె లోకమో? పాడో? అనుకొని రజస్వలా వివాహానికే సామాన్యగృహస్థులు కూడా సిద్ధపడడం వీలేమో అని నేననుకుంటాను. సంపన్నులో? లక్ష్యం లేనివారు కనక వారి చిత్తానుసారం చేసికొన్నా చిక్కులేదు. వారికీ జరిమానా ఒక లెక్కలోది కాను. ఒక రాజుగారు వేటకెళ్ళారట! చాలా సొమ్ము ఖర్చయింది కాని అనుకొన్న పెద్దపులి కనపడనే లేదు. అప్పుడు ఒక నౌకరు రాజుగారితో — బాబూ! వృథాగా ధన మంతా ఖర్చయింది. అనేటప్పటికి రాజుగారు ఆసమీపంలో పడుకున్న ఒక గొఱ్ఱెను చూపి, చాచా! దీనిబొచ్చు యెంత రాలిందో అని అన్నారట. విశేషసంపన్నులకు యెవరికో తప్ప ధనవ్యయం అంటే లేశమున్నూ గణన ఉండదు ప్రస్తుతం ఉన్న స్థితిలోనే ఉంటే యీ బిల్లు విశేషధనికులను లేశమున్నూ బాధించదు. కాని యిది యింకా తీవ్రరూపాన్ని తాల్చే సూచనలు కొన్ని కనపడుతూ వున్నాయి. మావాళ్ళు నన్ను దూషిస్తే దూషించ నియ్యండి. తీవ్రరూపాన్ని తాల్చవలసిందనియే నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. యీ శారదా బిల్లువల్ల యింతవరకు ఒకలాభం గోచరించింది. యెంత ధనికుడేనా సరే? యీ వంక మీద, యే ఫ్రెంచి గ్రామానికో, యే నైజాం పల్లెకో పోయి ముడిపెట్టుకోవడం సాగించడంచేత చాలా ఖర్చు తగ్గినట్లు కనపడుతూ వుంది. యిదైనా ధనికులకు మాత్రమే. బీదలకో! యింట్లో అయిదురోజులూ సలక్షణంగా అంతో యింతో చుట్టపక్కాలతో పెళ్ళి చేసుకుంటే యెంత ఖర్చవుతుందో? అప్పారుగూళ్లో ఒక నాడు లేదా ఒకపూట, చేసుకున్నా అంతగా గాని అంతకంటె యినుమిక్కిలిగానే కాని అవుతూనేవుంది. యెన్ని విధాల ఆలోచించినా యీ బిల్లు సాధుబాధ కొరకే యేర్పడ్డట్టు తోస్తుంది. యెందు కేర్పడ్డా శిరస్సు వొగ్గవలసిందే కాని రాజశాసనాన్ని యెదిరించడానికి శక్తి యెవళ్ళకుంది! శృంగారగ్రంథాలనిషేధం బాధించడం లేదా? ఆదిమాత్రం మనలో ప్రముఖులు తెచ్చి పెట్టింది కాదా! దానివల్ల వచ్చేనష్టిని కవులు అనుభవించడం లేదా! యీ చిక్కు మన ఆంధ్రానికి తప్ప యేభాషకేనా వుందా? అందులో యింకో విశేషం, వ్యక్తిగతద్వేషాన్ని పురస్క

రించుకొని ఒకకవి వేఱొక కవిని వచించడానికి ఆయా డిపార్టుమెంటుకు సంబంధించిన ఆఫీసర్లను ఆశ్రయించి—"బళి ! బళీ ! మీ తాత" అంటూ పద్యాలు చెప్పి వారి అనుగ్రహాన్ని సంపాదించి తద్ద్వారా శతృత్వాన్ని తీర్చుకుంటూ వున్నారని కొందఱనుకుంటూవున్నారు. ఇది సత్యమే. అయితే యింతకన్న శోచనీయప్పని వేఱొకటి వుండదు. వ్యక్తిగత ద్వేషాలే ప్రస్తుతవివాహాలకిన్నీ బాధకాలు. బిల్లు పూర్తిగా బిగిస్తే దొంగతనపు బాల్యవివాహాలకి లేశమున్నూ అవకాశమే వుండకుండా పోతుంది. పూర్వాచారపరాయణులకు సంఘబలం బొత్తిగాలేదు. అట్టిస్థితిలో బిల్లు బిగుసుకొని కూర్చుంటే యేంలాభం ? రాజశాసనాన్ని బట్టి పోవడం యుక్త మనుకుంటాను. స్త్రీలల్లో చాలా స్వతంత్రేచ్ఛ ప్రబలింది. విద్యావతులు యిప్పుడు చేసే ప్రయత్నాలవల్ల యింతకు ముందు అవిద్యావతులు అయుక్తప్రవర్తనకు లోఁబడి... తీర్థయాత్రలు సేవించిన జీవద్భర్తృకలైన పతివ్రతలుకూడా స్వసంతానంతోటిన్నీ, ఆసంతానాన్ని ప్రసాదించిన భర్తలతోటిన్నీ మళ్ళా స్వదేశానికి వచ్చి సంఘంలో చేరడానికి కొంత యత్నం చేస్తూ వున్నారు. ప్రస్తుతపు మార్పును బట్టి యింకా అట్టివాళ్ళని చేర్చుకోవడానికి యవకాశం లేకపోయినా అట్టివాళ్ళను చేర్చుకోవడానికి వారివారిదగ్గఱి బంధువులు రక్తస్పృక్కలవారు కొంత అంగీకారాన్ని సూచిస్తూన్నట్లు విని సంతోషిస్తూన్నాను. ప్రస్తుతం సాధుబాధగా వున్న శారదా బిల్లు అసలుపోతే చెప్పేదేమిటి ? దానికి మార్గం కనపడడంలేదు కనక అది తీవ్రరూపాన్నైనా తాల్చి అందఱినీ వక్కత్రాడుమీఁద నడిపించడం లోకోపకారంగా వుంటుందని నేనభిప్రాయపడతాను. యీలా నేను వ్రాయడం "అశక్తదుర్జనత్వప్రయుక్తం గాని పూర్వాచారాలు నాకు సరిపడక కాదు." ప్రస్తుతం నాకేదో అవసరంవచ్చి అనుకుంటారేమో ! అవిన్నీ కాదు. నాయింట్లో యీక్షణం వరకు పెండ్లికాదగ్గ ఆఁడ పసిపిల్లలున్నూ నిలవ లేరు. యిద్దఱు మొగపిల్లలు మిక్కిలి పసివాళ్ళున్నారు. ఆచిరంజీవుల పెళ్ళినాఁటికి యీశారదా బిల్లుచిక్కే కాదు జాత్యంతరపు వివాహపు చిక్కుకూడా పూర్తిగా వదలి పోతుందని నేను సంబరపడుతూన్నాను. "ఇతి ముద ముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే" ప్రస్తుతం లోకంకోసమే నేను ఆరాటపడేది. పట్నవాస్థుల కొఱకు దీనిలో వకమాటా నేను వ్రాయలేదు. వారు ధన్యులు. పల్లెటూళ్ళలోలాగ వకరిని వకరు వెక్కిరించరు. వొకరిజోలి వేఱొకరికి అక్కఱలేదు. వారిని చూస్తే యెంతో ముచ్చటయ్యేది. అక్కడ జరిగే విశేషాలన్నీ పల్లెటూళ్ళల్లోనున్నూ జరగడం తప్పదుగాని వొకళ్ళు వొకళ్ళని వెక్కిరించడంవిధి. అది అంతతో అఁగదు. సాధుబాధకింద పరిణమిస్తుంది. యీసాధుబాధ యెంతత్వరలో అంతరిస్తే అంత మంచిదని నాకు తోఁచి యీ నాలుగుమాటలూ వ్రాశాను. నన్ను ప్రాచీనాచారపరాయణులు క్షమిస్తారని తలుస్తాను. వారేమేనా ప్రయత్నించేయెడల నేను వారికి దాసానుదాసుఁడుగానే వుంటాను. సంఘ సంస్కర్తల కుటుంబాలలో కూడా అందఱూ సంస్కర్తలు కాకపోవడం చేత ప్రస్తుతపు బిల్లువల్ల చిక్కుపడుతూనే వున్నారు. కాఁబట్టి విస్తరించవలసిందిలేదు. త్వరలో యిది తీవ్రరూపం దాల్చడమే కావలసింది!

మ. కరణాలన్ వ్యవహారమందు జితులం గావించె నస్మత్సహో
దరుఁ డంచేను లిఖించినందులకుఁ గ్రోధం బింతగాఁ గల్గె నీ
కరుణన్ గెల్చెను ద్వత్ప్రతాపమని ని న్నగ్గించియున్నాఁడ. ఆ
సరసీజాప్తుఁడుగూడఁ గోపమున నన్ సాధించునేమో కదా ! 29

చం. వసుధను వైదికుండు మిముబోంటి మహోన్నతు నాశ్రయించుచున్
పసచెడి సంచరించుటయె భావ్యము. లౌకికవృత్తితో నిటుల్
మసలుట గొప్పతప్పెయగు. మత్సహజన్మున కట్టివిద్య తా
పొసఁగకయుంట లౌకికముఁ బూనెను. దానిని మీర్ క్షమింపనౌ.

ఉ. మీరలుకాని లేక మహి మీయటువంటి నియోగిపుంగవుల్
వేరునుగాని యుంచుకొని వేశ్మకృతుల్ పొనరింపఁజేయు చిం
తో రెముఁబెట్టఁ బూనుకొనుఁ. డొయ్యనమత్సహజన్ము నప్పయన్
దారికిఁదెచ్చి లౌకికము దండకుఁజేరక యుండఁజేసెదన్. 31

చం. కరము మృదూక్తులొప్ప నధికారులమ్రోలల కేగి శత్రుదు
శ్చరితములెల్లఁ జెప్పి తగు శాసనముల్ పొనరింపఁజేయుటల్
ధరణి భవాదృశోన్నతుల ధర్మము గా రహి మేము జాబులన్
సరిగ లిఖించి యేవిధపుసంగతి దెల్పుటగూడఁ గూడునే ? 32

ఉ. అష్టవధాన మెన్నొ సభలందుఁ బొనర్చుచుఁ గన్నవారు తా
మిష్టబహూకృతుల్ సలిపి యెంతొ నుతించిరి కాని యెచ్చటన్
దుష్టుఁడటంచుఁ జాటి నను దూఱినవారలు లేరు మీవలెన్.
శిష్టవినింద యేరికిని శ్రేయముగాదు యిఁకేని యెంచుఁడీ. 33

సీ. గడచె నార్వత్సరాల్ ఘనమైన కృతిసల్పి
బహుమతి గాదాయె రహినటంచు
తలఁచుచుండెడి నాకు దయతోడ నిపు డిచ్చు
బహుమతి చాలు నో బావగారు !
అల్ల బొల్లావెంకనాఖ్యముఖ్యుల కిచ్చి
నట్టిసొమ్ములు మాకుఁ బట్టవయ్య.
మాయిండ్ల మే ముండి మనఁజూచెదము గాన
మీ రూరకుండుఁడు. నూఱువేలు.

వైదికుల దుంపడెంచెద వడి నటంచు
మీసముల్ మెలివేసెడి మీతనూజు
సీతయుం గూడి మామీఁదఁ జేయిఁజేయ
పూనుటకు నెంతవారము పుడమి మేము? 34

సీ. ఉర్వి నన్నద్వేష ముద్భవించుటయును
అరయ బ్రహ్మద్వేష మతిశయించు
టయు నంత్యకాలంబు డాసినవానికే
అనుచు వీరారెడ్డి ననెడిమీరు
అట్టి బ్రహ్మద్వేష మకట! సంపాదించు
టకుఁ బూనితిరటంచుఁ బ్రకటమయ్యె.
స్థిరయశఃకాములై చెలఁగుచుండిన మీకు
తగునయ్య యీ చెట్టదారిఁ బడుట?
మీకుఁ దగినట్టి వీరులమీఁదఁ గత్తి
కట్టుటుచితంబ యగు మీకుఁ గాని యిట్టు
లుఱు ముఱిమి మంగలముమీఁద సరవిఁ బడిన
రీతి మామీఁది ద్వేషంబు ఖ్యాతిగాదు. 35

శా. క్రోధావేశత నున్నవాఁడు మిగులన్ గోపాలకృష్ణయ్య తా,
ఏదో చిక్కును బన్ని బంధుయుతుఁడై యీ జానపా టప్పయన్
సాధింపంగలఁడన్ జనోక్తి ప్రబలెన్ సత్కాశిరాజాన్వయాం
భోధీందూ! తగ దూన కట్టిపని యొప్పున్ మాయెడన్ నిర్దయన్. 36

ఉ. పూనవటంచు నిశ్చయము బుద్ధిని జేసియె యున్నవాఁడ నేన్.
కాని మఱెవ్వరైన నిను గట్టిగ వేడిన నొక్కవేళ నీ
మానస మట్టిచెయ్వునకు మళ్ళునొ యేమొ యటంచువ్రాసితిన్.
దీనిని జిత్తగించి మహిదేవులపై నరుదెంచకుండుమీ. 37

చం. మునుపటిబావగారెయని ముచ్చటదీఱఁగ వ్రాసితిం జుఁడీ.
కనుగొని యమ్మహీసురుని గౌరవ మే నొకకొంత తీయుటన్
కనలి లిఖించె, ఒండువిధిఁ గాదని మీమది నిశ్చయింపుఁడీ
ననుగుఱియించి వ్రాయుటిటు న్యాయముగాదని యెంచఁబోకుఁడీ.

శా. [illegible]ణిన్ మూడవచేయి వైదికునకే తాఁ దప్ప కుండంగ నా
సరసీజాతభవుండు సల్పె నితనిం జాదస్తపున్ ముద్దగన్
సరిగా నంచు వచించుచుండవాకొ నన్ సంతోషకాలంబులన్?
మఱి యేలోపము లుండినన్ సయిచి తన్మాహాత్మ్యమం చెంచనా.

చం. గతజలసేతుబంధనము కార్యముగాదు తలంచిచూచినన్
వెతుకక తప్పు లింక నిటు విశ్వసనీయులమైన మాపయిన్
కుతుకముతోడ మైత్రి నిఁకఁగొంచెము వృద్ధియొనర్పఁజూడుఁడీ.
మతినిడి వీని మాక యవమానము సల్ప యతింపఁబోకుఁడీ. 40

అని యాగోపాలకృష్ణయ్యగారికి లేఖ వ్రాసితిని. సిర్వా పంపుటకుఁ బ్రయత్నించుచుండఁగా నుభయులకును స్నేహితుఁడైన తుమ్మలచెఱువు సూర్యనారాయణగారయ్యది చదువుకొని యేను బంపుదునని తాను దీసికొనియెను. కాని కడ కాయన పంపినట్టు కనుపట్టదు. ఆలేఖ యాయన యాగ్రహమునకే యభివృద్ధికారక మని యాలోచించి కొంబోలు వారికిని వీరికిని జదివి వినిపించుచు వద్దనేయుంచుకొనియెను. చదువ విన్నవారు చని యాయనతోఁ జెప్పుచున్నట్లును విని యాయన కనుటకుఁ గలవరపడుచున్నట్లను గనుటయే సంభవించిన ననుఁ గచ్చేరీలపాలు చేయునట్లును జనశ్రుతి చాలఁ గలిగెను. కచ్చేరీలపాలు చేయఁదగినంత కఠినభాష నేను గమ్మలోఁ గనఁబఱుపకున్నను జనశ్రుతి ననుఁ గొంత భయపెట్టెను. పులిపాక పూర్ణయ్యగారి కొకపరి కలవిధము దెలియఁజెప్పి కమ్మ చదివి వినిపించితిని.

కం. పూర్ణయ్యగారి కీర్తి యుదీర్ణౌన్నత్యంబు గలిగి దిగ్గజయానా
కర్ణావతంసమైనది. వర్ణింపఁగఁదగిన దతనివర్తన యరయన్.

సీ. భూసురుం బొడగన్నఁ బుచ్చునే యతఁ డొక్క
అహమేని తనశక్తి నన్న మిడక.
విద్వాంసుఁ బొడగన్న విడుచునే యతఁ డొక్క
నెలయేని తనయింట నిలుపుకొనక.
యాచకుం బొడగన్న ననుపునే యతఁ డొక్క
మాసంపు బత్తెమున్ జేసి యీక.
ఆర్తుని బొడగన్న నరుగునే యతఁ డొక్క
అడుగేని యాతని నరసికొనక.

అన్నదాత. విద్వదాదృతిశీలుండు.
అర్థికల్పశాఖి. ఆర్తిహరుఁడు

పూర్ణయాభిధానుఁ బుడమి నేతన్మాత్రుఁ
డనుచుఁ జెప్ప నెవరి కాడు నోరు ?

అట్టి రసికుఁడైన యా న్యాయవాది యస్మల్లిఖిత లేఖ నవలోకించి యానందించి గోపాలకృష్ణయ్యగారైనను గుణగ్రాహి యైనచోఁ బశ్చాత్తాపమే పడునుగాని పైఁబడఁ బ్రయత్నింపఁడనియు నాగ్రహ మాఁగలేక యన్యథా యభిప్రాయపడినను బహిరంగలేఖగాని ప్రభుత్వమువారు సాటింపరనియుఁ జెప్పి కవరులోఁ బెట్టి తానే యాయన కాలేఖ యంపెను. అది యందినదియు లేనిదియు నభివ్యక్తము కాకమునుపే యాయన యంతరించెను. అంతకుఁబూర్వమే యప్పుడిక్కడ డిప్టీకలెక్టరుగానుండిన కుప్పా శేషాచలపతిపంతులుగారికి నేను–

సీ. పరికృతము మీచేతఁ బాలింపఁబడుచున్న
పల్నాటిలో జానపాడనంగఁ
బడునట్టి యొకయూర బలు ప్రసిద్ధుండైన
భూసురోత్తమునకు జననమొంది
బుద్ధివచ్చినదాది పోయి దేశముమీఁద
సత్పండితులయొద్దఁ జదివి చదివి
సంస్కృతాంధ్రోభయసాహిత్య మార్జించి
అవధానసత్కృతీకరణార్హకవిత
గీ. పడసి కితచేత నేర్పర్పఁబడినవృత్తి చాల లేకునికి నష్టప్రు సత్సభాళి
దర్శితాత్రీయకలుఁడనై తద్వితీర్ణ ఘనధనంబునఁ గాలంబు గడపువాఁడ.
సీ. ప్రౌఢ శేషాచలపతిపంతు ! లోకయన్న
వెంకటప్పయ్యనా వెలయు నాకు.
ఆయన కేవిద్య నధికపరివేశంబు
కల్గకున్నటువంటికారణమున
ఎవ్వారినో యాశ్రయించి మాయూరి లై
సెన్సుగుమాస్తగాఁ జేయఁగఁబడి
వర్తిలుచుండంగ వైదికుం డేమి యి
ట్లుద్యోగినాఁబడి యుండు లేమి
అనుచు మాగ్రామణుల్ కర మాగ్రహమున
వడిని మహజరు లిప్పించి కడుఁబ్రయత్న
మునను డిస్మిసుఁజేయించియును దదాది
కరము పగఁబూనియుండిరి కడకు వారు.